# హరిజన హాస్టళ్లకు ప్రభుత్వం చేయవలసిన సహాయం

## మేనేజర్ల మహాసభలో వేములకూర్మయ్య ప్రభృతుల ప్రసంగాలు

తెనాలి, డిసెంబరు 26: స్థానిక శ్రద్ధానంద హరిజనవాడలో నిన్న ఆంధ్రరాష్ట్ర హరిజనహాస్టలు మేనేజర్ల మహాసభ బళ్లారి హరిజనహాస్టలు మేనేజరు బి. యల్. గంగాధర చెట్టిగారి అధ్యక్షతను జరిగినది. వివిధమండలాలనుండి వందమంది సభకు వచ్చారు.

ప్రథమంలో వేములకూర్మయ్యగారు జాతీయపతాకాన్ని ఎగురవేశారు. హాస్టలుహరిజన బాలబాలికలు వందేమాతరం గీతం పాడారు. తరువాత గంగాధర చెట్టిగారు అధ్యక్షతవహించారు.

### స్వాగతోపన్యాసం

శ్రద్ధానంద హరిజనపాఠశాలా స్థాపకురాలు ఆహ్వానసంఘాధ్యక్షురాలు అగు కొల్లా కనకవల్లి తాయారమ్మగారు ప్రతినిధులకు స్వాగతమిస్తూ ఇట్లా ఉపన్యసించారు: ఈ సభా సమావేశస్థలమునకు కొంత ప్రాముఖ్యము కలగు. హరిజనోద్ధరణ యాత్రా సందర్భంలో, పూజ్యబాపూజీ, పవిత్ర హస్తములతో యీ శ్రద్ధానంద హరిజన వాడకు శంఖుస్థాపన చేశారు. సత్యమహాత్యశ్రమ, కాలమహాత్మ్యశ్రమ, మిశ్రితమయిన, యీ సమయం, ఆశాపూరిత భవితవ్యానికి ప్రాతినిధిక నిర్వ గలదని తలంచుచున్నాను. నాటికి, నేటికి పరిస్థితులు మారినవి. నాడు – దాస్యము నేడు – స్వాతంత్ర్యము స్వతంత్ర భారతిలో పీడిత ప్రజానీకానికి విముక్తి కలిగించిన గాని, శేశం బలిష్ఠంగాదు. దేశమున వివారముచేయు, మాధ్యము, సాంఘిక దౌష్ట్యములు, అవినీతి, విద్య, నిర్మూలించుటకు శరిపిగ విశ్వవిద్యాలయములు. పాఠశాలలు నెలకొల్పవలయును, దేశస్వాతంత్ర్యము ఓ విధంగా పొందగలిగితిమి గాని నిరతు రాశ్యత, అభ్యుదయ నిరోధక శక్తుల నిం కను జయింపలేకపోతిమి. వివిధ రంగములలో అభ్యుదయ శక్తుల కృషిపైనే యీ జయమాధారపడియున్నది.

నేడు మన రాష్ట్రంలో దాదాపు 400 వసతి గృహములను ప్రజాసేవకులు నిర్వహించుచున్నారు. ప్రభుత్వం దాదాపు 10,000 మంది విద్యార్థులకు సహాయపడుచున్నది. రాష్ట్రములన్నిటిలో, మద్రాసు రాష్ట్రము హరిజనోద్ధరణ కృషిలో మేటిగానున్నదన్న విషయం గమనింపదగియున్నది. ఈ వసతి గృహముల నిర్వహణకు పూర్తిగ ప్రభుత్వము మీదనే ఆధారపడుటకన్న, స్వయంకృషిమీద గూడ ఆధారపడి యుండుట మంచిది. కలిగియున్న ధనికులు అందుకు పూర్తిగ సహాయింప గలరని విశ్వసించుచున్నాను. పీడిత ప్రజానీకోద్ధరణ ధనికుల నైతిక బాధ్యతయె గాక వారికొరకనే గుర్తించుట అవసరము.

వ్యక్తిద్వేషము, ముఠాలాచకీయము దురహంకారములయిన శక్తులకు, అవమానములకు, యీ సేవారంగము దూరముగ విషయము మీరెరుంగనిది గాదు. సత్పథమున, ఒక నిర్ణీత ప్రణాళిక యీ సభా సమావేశం చేకూర్చగలదని విశ్వసించుచున్నాను.

### ప్రారంభోపన్యాసం

తరువాత వేముల కూర్మయ్యగారు సభను ప్రారంభిస్తూ ఇట్లుపన్యసించారు: ఈ సభ చాలా ముఖ్యమైనది. ఆంధ్ర రాష్ట్రము నుండే గాక తమిళ రాష్ట్రమునుండికూడా యింతమంది ప్రతినిధులురావడం సంతోషకరమైనవిషయం. ప్రథమంలో గాంధిగారి ఆజ్ఞానుసారం పిదపాలెంలో కృష్ణా శ్రీమానయ పేరుతో హరిజనహాస్టలు [illegible] బదరులలోను, [illegible] వసతిగృహం 115 మంది హరిజన బాలబాలికలతోను ఏర్పాటైంది. 1934 సంll హరిజన సేవాసంఘాలు స్థాపించారు. ఆంధ్రరాష్ట్రహరిజన సేవాసంఘానికి శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు అధ్యక్షులుగనుండి పనిచేశారు. ఈ శ్రద్ధానంద హరిజనవాడలో కొల్లా కనకవల్లి తాయారమ్మగారు కృషిచేసి హాస్టలుకు పక్కా బిల్డింగులు వేయించగలిగారు. హాస్టలు నడపడం చాలా కష్టమైన పని. సభకు వచ్చిన ప్రతినిధులంతా బాగాఆలోచించి హాస్టలు ఏవిధంగా నడపాలో తగిన విధానం నిరూపించాలి. విద్యార్థులుకూడా మేనేజర్లను చాలా కష్టపెడుతున్నారని చాలాఫిర్యాదులు వచ్చినవి. హరిజనవిద్యార్థులకు కష్టాలున్న మాట వాస్తవమే, భాగ్యవంతుల విద్యార్థులకున్న వసతులు హరిజన బీదవిద్యార్థులకు లేవు. అట్టివసతులు యిప్పించటం కష్టమైనపని. నేను మంత్రిగా వున్నప్పుడు విద్యార్థికి రు 15/రూ ఏర్పాటుచేశాను. విద్యార్థులుకూడా జాగ్రత్తగా వుండాలి. నేను విద్యార్థిగా వున్నప్పుడు నన్ను పసంక్తికి రానీయలేదు. దూరంగాకూర్చోపెట్టారు. అట్టి అస్పృశ్యతను రూపుమాపినాము చట్టాలుకూడా పెట్టినాము. హరిజనవిద్యార్థుల సౌకర్యం నిమిత్తం మన ప్రభుత్వం ఎక్కువగా సహాయపడుతున్నది. హరిజనులకు ఇదివరకు ఖర్చుచేసినదంతా జనరల్ ఫండ్సునుండే చేసితిమి. నేనిచ్చిన మాదిరిగానే హరిజన హాస్టల్సుకు పూర్తిగా గ్రాంటుల నివ్వమని మనమంత్రి పరమేశ్వరన్ గారితో చెప్పితిని. హరిజన నిధికి యింత డబ్బురావడానికి కారణభూతులు గౌll ఆర్థికమంత్రి మన గోపాలరెడ్డిగారే. ఇకముందు హరిజనబాలబాలికలు యితర వెనుకబడిన జాతుల బాలబాలికలు కలసి హాస్టల్సులో వుండునట్లు ఏర్పరచాలి. అస్పృశ్యత బ్రాహ్మణులలోను కమ్మవారిలోను ఇతరులలోను పూర్తిగా పోయినదిగాని యింకా వైశ్యులకు పోలేదు. హాస్టల్సు నడుపువారు స్వార్థంతో నడపడం లేదని నాకు తెలుసు. విద్యార్థులు ముఠా రాజకీయాల, కమ్యూనిస్టుల జోలికి పోకుండా బాగాచదువుకోవాలి. మేనేజర్లు హాస్టల్సులోనుండి విద్యార్థులకు తగిన నీతిని క్రమశిక్షణను నేర్పాలి. అన్ని కాలేజీ హాస్టల్సులోను అందరిని కలుపుకొనుటకు ప్రయత్నిస్తున్నాము. మేనేజర్లు మాత్రం హరిజన విద్యార్థులను ఏమన్నా అంటేవారు వెళ్లిపోతారేమోనని భయపడరాదు. హాస్టల్సులో హరిజనవిద్యార్థులువారికి తగినపనులు వారు స్వయంగా చేసుకోవాలి ఎక్కువమంది విద్యార్థులున్నచోట వంటకు మనిషిని ఏర్పరచుకోవచ్చు. లేనిచో వారు స్వయముగా వంట చేసుకోవచ్చును. మేనేజర్లంతా తగిన సంఘమును ఏర్పరచుకొని ప్రభుత్వంతో సంప్రదించి, తగిన వసతులను ఏర్పరచుకోవలెను. బాల బాలికలను మీ బిడ్డలు మాదిరిగా చూడండి డబ్బు లేదని చింతపడకండి, వీరికోసరం బిచ్చమెత్తినా తప్పులేదు. మన గాంధిగారు ఎల్లప్పుడు హరిజనుల నిమిత్తం బిచ్చమెత్తినాడు. తెచ్చిన ద్రవ్యాన్ని సక్రమంగా వినియోగించండి.

### అధ్యక్షోపన్యాసం

గంగాధర చెట్టిగారు అధ్యక్షోపన్యాసములో తాయారమ్మ గారు హరిజన హాస్టలు విషయంలో చేసిన సేవను ప్రశంసించి మిగతా వారు ఆమెను ఆదర్శంగా పెట్టుకోవాలంటూ ఇట్లా ఉపన్యసించారు స్వరాజ్యం నిల్పబెట్టుకోవాలంటే అస్పృశ్యతా నివారణ కావాలి. సంఘం అభివృద్ధిని పొందాలంటే విద్యాభివృద్ధి ఆవశ్యకము ప్రథమంలో ప్రజలు హరిజన నిధికి విరాళము లిచ్చిరి గాని యిప్పుడు రాను రాను పూర్తిగా మానివేసి హాస్టల్సు అన్ని ప్రభుత్వం మీదనె ఆధార పడవలసిన స్థితి ఏర్పడినవి. హాస్టల్సులో చదువుకున్న హరిజన విద్యార్థులు వారి వారి పల్లెలకు పోయి తగిన ప్రచారం చేయలేకుండా వున్నారు.

తరువాత ఆహ్వాన సంఘ కార్యదర్శి నందిపాటి నారాయణ గారు సర్దార్ వల్లభాయ్ పటేలు గారు, రాష్ట్రపతి పట్టాభి సీతారామయ్య, గవర్నరు భావనగర మహారాజా, ప్రధాని కుమారస్వామి రాజా, కె. మాధవమీనన్, హరిజన వెల్ఫేర్ కమిటీ డైరెక్టర్ భాష్యం అయ్యంగారు మొదలగు వారు పంపిన సందేశములను చదివారు. అంతటితో ఉదయం కార్యక్రమం ముగిసెను. సాయంకాలం ప్రతినిధుల సమావేశంలో ముఖ్య తీర్మానముల మీద చర్చ జరిగినది. అల్పాహారానంతరం తిరిగి మహాసభ జరిగెను. క్రింది తీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదింపబడెను.

### తీర్మానాలు

దేశసేవాధురంధరులగు పూజ్యబాపూజీ; దేశభక్త కొండా వెంకటప్పయ్యగారి మరణములకు చింతించుచూ వారి ఆత్మలకు శాంతిని కోరుచూ తీర్మానించడమైనది.

తరువాత వేముల కూర్మయ్య, మాగంటి బాపినీడు గార్ల హరిజన సేవానిరతిని ప్రశంసించుచూ తీర్మానించిరి. ప్రతి హరిజన హాస్టలులోను గల విద్యార్థులందరికీ గ్రాంటు లివ్వాలని ప్రభుత్వం వారిని కోరడమైనది.

ప్రస్తుతం మదరాసు రాష్ట్రములో నున్న బంజరు భూములను ప్రతి హాస్టలుకు 25 యకరముల చొప్పున యిప్పించాలని, హరిజన హాస్టల్సులోని విద్యార్థులకిచ్చు గ్రాంటు రూ. 20/—లకు హెచ్చించాలని విద్యార్థులకు సాలుకు కనీసము 2 సార్లు యాత్రలకు అయ్యే ఖర్చులను కూడ ఇప్పించాలని ప్రభుత్వమును కోరడమైనది

# రాయలసీమకు సమాన ప్రాతినిధ్యం

## ప్రధాని వద్దకు కర్నూలు వాసుల రాయబారం

మద్రాసు, డిశంబరు 28: నిన్న టిదినం శ్రీ కె. శేషాచారి నాయకత్వమున కర్నూలు జిల్లా బోర్డు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సభ్యులు డి. పి. సుబ్బారెడ్డి, సోముల సుబ్బారెడ్డి గారలు, కర్నూలు పురపాలక సంఘ సభ్యులు శ్రీ సంపతియ్య రెడ్డి గారు, కర్నూలు జిల్లా ప్రముఖ కాంగ్రెసు వాదులు శ్రీయుతులు దండిపల్లి వేంకట సుబ్బాశాస్త్రి, కైప సుబ్రహ్మణ్య శర్మగారలతో కూడిన ఒక రాయబార వర్గము కర్నూలు మండలము తరఫున గా. మద్రాసు ప్రధాని శ్రీ పూసపాటి కుమారస్వామి రాజాగారినికోటలో సందర్శించి ఒక విజ్ఞప్తిని అందచేసిరి.

ఆ విజ్ఞప్తిలో "శ్రీ బాసుపాష్టు" థార్ కమిటీ, నాయకత్రయ నివేదికలో సూచించినట్లుగా నూతన ఆంధ్ర రాష్ట్రమందు రాయలసీమ ప్రాతినిధ్య విషయమై ఇపుడు ప్రత్యేకంగా ఆలోచింపవలసి వున్నది. రాయలసీమవాసులు తమ సహకారమును మనఃపూర్తిగా ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమునకును, ఆంధ్రదేశ అభ్యున్నతికిని దోహద మొసంగుటకై రాబోవు ఆంధ్ర రాష్ట్ర శాసనసభలో రాయలసీమకు తగుమైన ప్రాతినిధ్య మవసరమని భావించుచున్నారు. రాయలసీమ సర్వతోముఖాభివృద్ధికై ఆంధ్రరాష్ట్ర శాసనసభలోను, మంత్రివర్గము లోను కోస్తాజిల్లాలకు— రాయలసీమ జిల్లాలకు పరిసమానమైన ప్రాతినిధ్య మిచ్చుట చాలముఖ్యము. ఈ పరిసమాన ప్రతిపత్తి రాయలసీమకు మొదటి పదిసంవత్సరములవరకు ఇచ్చి తరువాత పరిస్థితులను మరల ఆలోచించుటకుగాను గవర్నర్ జనరల్ గారు ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకై జారీ చేయబోవు ఆర్డర్ ఇన్ కౌన్సిల్ ఈ తర్ఫులో ఒక ముఖ్యమైన వరతుగా చేర్చవలెనని గవర్నర్ జనరల్‌ను ప్రార్థిస్తున్నాము.

అట్లు పరిసమానమైన ప్రతిపత్తిని ఇవ్వక పోయిన నూతన ఆంధ్రరాష్ట్ర అవతరణము రాయలసీమవాసులకు అసంతృప్తి కలిగించుటయే కాక నిరంతరవైషమ్యములకు, శాసనసభయందలి ప్రతిష్టంభనలకు కారణభూతమగును. అందుచేత రాష్ట్రపరిపాలన సవ్యముగా జరుగుటకు అవకాశము కలుగదు. ఈ పరిసమాన ప్రతిపత్తి రాయలసీమయొక్క చారిత్రక, వైజ్ఞానిక ప్రత్యేకతను ఉద్ఘాటించుటకు కోరడమైనది. ఈ విజ్ఞప్తిని విభజన సంఘములో చర్చించుటకును, కేంద్రప్రభుత్వమువారికి పంపుటకును గా, మద్రాసు ప్రధానమంత్రి గారిని కోరిరి."

రాయబారవర్గమువారి విజ్ఞప్తిని శ్రీ పూసపాటి కుమారస్వామిరాజాగారు సావధానముగా విని, తను సహాయము చేయుదుమని వాగ్దాన మొసంగిరి.

## అనంతపురమువారి కోరిక

అనంతపురం, డిసెంబరు 28: విద్యా విజ్ఞానములలోను, రాజకీయ సాంఘికరంగములలోను పురోభివృద్ధిజెంది చారిత్రక ప్రసిద్ధమై, జలస్థలసదుపాయం తగినన్ని కల్గి ఇంకను అభివృద్ధి యగుటకు కావలసిన అవకాశములు గల్గియున్న అనంతపుర పట్టణమును రాజధానీనగరముగ నిర్ణయించి రాయలసీమ సర్కారులకుజరిగిన శ్రీబాగు ఒడంబడికషరతులను తప్పకుండా అనుసరించి అనుమానములకు ఎవెనిన్నికూడదని ఆంధ్రశాసనసభ్యులను విభజనసంఘము వారిని ప్రభుత్వమును కోరుచు నిన్న జరిగిన అనంతపురం పౌరసభలో ఏకగ్రీవముగా తీర్మానింపబడెను. వి. రామచంద్రరావుగారు అధ్యక్షతవహించిరి వి. రంగరావుగారు తీర్మానము ప్రతిపాదించిరి. అనంతపురం న్యాయవాద సంఘము, రేటుపేయర్ల సంఘము మొదలగు ఇతర సంఘములవారుగూడ పైవిధముగనే తీర్మానములు చేసిరి. (స్వ. వి.)

### కడప జిల్లాబోర్డు తీర్మానం

కడప జిల్లాబోర్డువారుకూడా ఇదేవిధంగా తీర్మానించేశారు. ఆ తీర్మానాన్ని అధ్యక్షుడు, టి. పుల్లారెడ్డిగారు విభజన సంఘ అధ్యక్షునికి టెలిగ్రాంద్వారా అందచేశారు.

---

ఈ తీర్మానాల మీద సాధువమ్మ, వక్కాచిన వెంకయ్య, ఆర్చ చుక్కుమాదాసు మొదలగువారు మాట్లాడారు. తరువాత ఈ క్రిందివారు మహాసభ తీర్మానాలను అమలు పరచడానికిగాను కార్యవర్గ సభ్యులుగా ఎన్నుకొనిరి:—

అధ్యక్షుడు:—మాగంటి బాపినీడు గారు, ఉపాధ్యక్షురాలు:— కొల్లా కనకవల్లి తాయారమ్మ గారు, ప్రధాన కార్యదర్శి: యస్. వెంకట సుబ్బయ్యగారు, సహాయ కార్యదర్శి:—గూడూరి రంగన్న గారు, కోశాధికారి:—బి యస్. గంగాధర చెట్టి గారు మరి 15 మందిని జిల్లాల వారిగా కార్యవర్గ సభ్యులుగా ఎన్నుకొనిరి. తరువాత ఆహ్వాన సంఘ కార్యదర్శి నందిపాటి నారాయణ గారి వందనములతో సభ ముగిసెను. ఆహ్వాన సంఘంవారు వచ్చిన ప్రతినిధులకుచక్కని భోజనవసతులు ఏర్పరచారు

# నవ భారత రాజ్యాంగం

## సాఫల్యానికి ఆచరణ విధాన ప్రాధాన్యం

### అల్లాడి కృష్ణస్వామి అయ్యగారి అభిప్రాయాలు

"ఎంత బాగా ఆలోచించి రచింపబడిన రాజ్యాంగవిధానమైనను, ఎంతజాగ్రత్తగా రచింపబడిన రాజ్యాంగ విధానమైనను విమర్శకు అతీతము కాజాలదు. వివిధ శాసనసభలు ఎన్నుకొనిన ప్రతినిధులతో కూడిన భారతరాజ్యాంగ పరిషత్తు మూడుసంవత్సరముల పర్యంతము బాగా ఆలోచించి, వివిధ ఉపసంఘముల నివేదికలను జాగ్రత్తగా పరిశీలించి రాజ్యాంగ విధానమును తయారుచేసినది. రాజ్యాంగ విధాన అంగీకరణానంతరము సాధారణ పౌరులు దానివిషయమై అవలంబించవలసిన వైఖరి రాజ్యాంగవిధాన చర్చసమయమున వారవలంబించిన వైఖరికంటె సంపూర్ణముగా భిన్నమైనదిగా నుండవలెను. భారత రాజ్యాంగ విధానము ద్వారా యావన్మంది ప్రజలకు వోటింగు అధికారము లభించుచున్నది. సాంఘిక నియోజకవర్గములు రద్దయినవి. దేశమందంతట చెదరియున్న బహుసంఖ్యాకములగు సంస్థానములు రద్దయినవి. తక్కిన సంస్థానములు రాష్ట్రములతో సమమైనవి. భారత రాజ్యాంగ విధానముయొక్క ముఖ్యలక్షణములివి. భారత రాజ్యాంగ విధానము ప్రజాసత్తాక రాజ్యాంగమని, ప్రజాప్రతినిధి ప్రభుత్వ సూత్రములకు భారత రాజ్యాంగ విధానము కట్టుబడియున్నదని యిందువల్ల స్పష్టము కాగలదు. ప్రభుత్వ వ్యవహారములు సరళముగా జరుగవలెనను ఉద్దేశ్యముతోను, ప్రభుత్వములో ప్రతిష్టంభనలను వారించు ఉద్దేశ్యముతోను పార్లమెంటరీ ప్రభుత్వం స్థాపింపబడినది. ప్రజాసత్తాక వ్యవస్థకు వ్యక్తి స్వాతంత్ర్యము, వాక్స్వాతంత్ర్యము మూలాధారములని రాజ్యాంగ విధానమునందలి పదియవఅధ్యాయము తెలుపుచున్నది. ఏనప్పటికి దేశమునకు భద్రత యున్నప్పుడే యిట్టి స్వాతంత్ర్యము విలసిల్ల గలదని ఈ అధ్యాయము చెప్పుచున్నది.

### అమెరికా అనుభవము

భారత రాజ్యాంగ పరిషత్తువారు నిర్మించిన ప్రజాసత్తాక రాజ్యాంగమును సద్భావముతో అమలు చేసినట్లయినచో భారతదేశభవిష్యత్తు గొప్పదిగా నుండును. ఇట్లుగాక భారతరాజ్యాంగ విధాన చర్చాసమయమున ప్రదర్శించుచుండిన నిశిత విమర్శనా వైఖరిని, వాదనపై పుణ్యమును యిప్పుడుగూడ ప్రదర్శించిన యెడల భారత దేశ భవిష్యత్తు గొప్పదిగా నుండదు. ఇతర దేశములలో మహత్తరమైన ప్రజాసత్తాక సంస్థల అనుభవమువల్ల నాకీ నమ్మకము దృఢపడినది. అమెరికను ఫెడరల్ రాజ్యాంగవిధానమును ఆమోదించు సందర్భమున అమెరికాలో యేమి జరిగినదో రాజ్యాంగ విధాన విమర్శకులు జ్ఞాపకముంచుకొనుట సమంజసము. ప్రాత రాజ్యాంగ విధానమునుసరించి వ్యవహా...

# తిరుపతి స్టార్బోర్డు మిల్లుకు ప్రభుత్వ సహాయం

## ఏప్రిల్ నుంచీ పని ప్రారంభమయే సూచన

తిరుపతి, డిసెంబరు 27: స్థానిక శ్రీ వెంకటేశ్వర స్టార్బోర్డు పేపరుమిల్లు సర్వసభ్య సమావేశము మొన్న జరిగినది. ఈ మిలు పనులు పూర్తి చేయుటకుగాను మద్రాసు ప్రభుత్వం 2½ లక్షల రూపాయిలు అప్పు ఇచ్చియున్నారు. విద్యుచ్ఛక్తి వసతిలు ఇవ్వగానే ఏప్రిల్ నెలలో మిల్లు పనిచేయుట ప్రారంభమవుతుందని పి. రాధాపతిగారు చెప్పిరి. ఈ ప్రాంతాలలో ఇదే తొలి పేపర్ మిలు.

(స్వ. వి.)

# నేపాళ భారతదేశాల సంబంధాలు

## ఢిల్లీకిరమ్మని నేపాళప్రధానికి నెహ్రూ ఆహ్వానం

బొంబాయి, డిసెంబరు 27: నేపాళ రాజ్య ప్రధానమంత్రిని ఢిల్లీకి విచ్చేయవలసినదిగా పండిట్ జవహర్లాల్ నెహ్రూగారు ఆహ్వానించిరని తెలియుచున్నది.

పండిట్ నెహ్రూగారు కామన్వెల్తు రాజ్యాల సభకు హాజరగుటకై కొలంబో వెళ్ళివచ్చినతర్వాతనే నేపాళం ప్రధానమంత్రితో సమావేశము జరుగగలదు. ప్రస్తుత ఆసియాఖండ వ్యవహార సమస్యలను ప్రపంచ వ్యవహార విశేషములను ఉభయులు కలిసి చర్చించెదరు. ఈ సమావేశము చాలాదినములక్రిందటనే జరుగవలసియుండెను. ఈసమావేశములో ఇండియాకు నేపాళమునకు గల సంబంధములను వృద్ధిచేయు విషయములు చర్చింపబడును.

నేపాళ రాజ్యములో అణుశక్తిఉత్పత్తికి అక్కరకురాగల యురేనియం లభించుననియు, నేపాలైట్ అనే ఖనిజములో అది లభించుననియు ఈ యురేనియమును అమెరికా ప్రభుత్వము తీసికొనే నిమిత్తమై నేపాళంలోని తూర్పు ప్రాంతమును కొంత నేపాళ ప్రభుత్వము అమెరికాకు కవులు కీయదలంచియున్నదనియు ఇటీవల కలకత్తానుంచి ఒక పత్రికలో ప్రకటింపబడెను. ఈ పత్రికా ప్రకటన విషయమై ప్రస్తుతము బొంబయిలో ఉన్నటువంటి నేపాళరాజ్య విదేశాంగమంత్రియగు విజయ షంషేరజంగు బహదూరు రాణాగారిట్లు చెప్పిరి: నేపాళంలో యురేనియము అనే అణుశక్తి ఉత్పాదకలోహం లభించేటటువంటి ఖనిజము ఉన్న సంగతి నేపాళప్రభుత్వమునకే తెలియదు. అట్టి లోహం అమెరికాకు లభింపజేయుటకై అమెరికాకు కవులుకివ్వదలెనని నేపాళప్రభుత్వం ఉద్దేశించుట అసంభవం. అందుచే ఇటువంటి అసత్యవార్తలు ఈ పత్రికా ప్రకటనలు ఇండియాకు నేపాళమునకు గల సఖ్యతను స్నేహమును భంగపరచుటకు సాధనభూతము కాగలవు

---

అభ్యర్థుని విస్తృతాధికారములు ... ఆక్షేపించిరి. అధ్యక్షునికిని, సెనేటుకును సంధులు చేసికొను అధికారముండుట ...

# ప్రభుత్వ ప్రస్తుత విధానంలో గ్రామాల క్షేమాభివృద్ధులు నిర్లక్ష్యం కాతున్నవైనం

## చాపాడు ఫిర్కా గ్రామసేవకుల మహాసభలో రాష్ట్రఫిర్కా అభివృద్ధిశాఖాధికారి ప్రసంగం

### గ్రామస్థులకు, గ్రామసేవకులకు ఉద్బోధము

ప్రొద్దుటూరు, డిసెంబరు 26: చాపాడుఫిర్కా గ్రామసేవకుల మహాసభ మొన్న రాష్ట్రఫిర్కా అభివృద్ధి శాఖాధికారి జి. వెంకటచలపతి అధ్యక్షతను జరిగింది. వి. వీరబ్రహ్మంగారు అధ్యక్షుని సభికులకు పరిచయం చేస్తూ వీరు ఆంధ్రులు కారని, పూర్వం వీరి పెద్దలు అరవదేశంచేరి అక్కడ స్థిరపడినారని, వీరు గాంధిజీ సూత్రాల ననుసరించేవారని ఒక ఆశ్రమం కూడా నడిపించారనీ, వీరి ఆదర్శ సేవ చూచి రామస్వామిరెడ్డిగారు ప్రధానిగా ఉన్నప్పుడు అభివృద్ధిశాఖలో పనిచేయ శక్తిగలవారు వీరేనని వీరికీపదవి యిచ్చారని తెలిపారు.

వెంకటచలపతిగారు తమ జన్మాదికం తెలిపి తెలుగుదేశంలో తమకు వచ్చిన తెలుగులోనే ప్రసంగిస్తానంటూ ఇట్లా ఉపన్యసించారు: నాకు అరవ, తెలుగు భేదాలులేవు నేను పుట్టి పెరిగింది అరవదేశం. అక్కడనే నాకు మిత్రులెక్కువ. అయినా సమాజంలో సేవచేసే ఏ భాషకు చెందినవారిని చూచినా యెక్కువయిష్టము. రేపు ఆంధ్ర, అరవదేశాలు ప్రత్యేకింపబడినాకూడా నాకు భేదభావం ఉండదు. భేదభావాలులేక కలిసిమెలిసి పనిచేస్తేనే సమాజం వృద్ధిఅవుతుంది. మనకు రాష్ట్రం ముఖ్యం కాదు. మహాత్ముని సూత్రాలప్రకారం ఆత్మలు కలవాలి. అప్పుడే మన ఆశయాలు నెరవేరతాయి. కులమత తత్వాలు పాటించకుండా ఉంటేనే సంఘం నిర్మింపబడుతుంది. సంఘబలంతోనే గ్రామ కట్టుబాట్లు, సౌకర్యాలు కలుగుతాయి. అప్పుడు ఆనందంగా యుండవచ్చు. మనకు యింతవరకూ రాజకీయ స్వాతంత్ర్యం వచ్చింది. కాని ఆర్థిక, సామాజిక సమానత్వం రావాలి. స్వాతంత్ర్యం ఫలానామైనుకు వస్తుందని చెప్పవొచ్చు కాని ఆర్థిక, సామాజిక సమానత్వం ఫలానామైనుకు వస్తుందని చెప్పలేం. వస్తుందోరాదో అని నాకే భయంవేస్తోంది. ఎంచేతంటే మనం కేవలం పాశ్చాత్య నాగరికతకు అలవాటు పడ్డాం. ఇండియా ప్రధానామాత్యుడు మొన్న అమెరికా దేశపర్యటన చేసివచ్చి అక్కడ పట్టణాలు 10 సం|| క్రితం కన్న యిప్పుడు బాగా అభివృద్ధి పొందాయని చెప్పారు. ట్రాక్టరుపెట్టి భూమి దున్నించమన్నారు కాని యిక్కడ పల్లెలలో నాగలికి కావలసిన కర్రలు దొరకటంలేదు. పట్టణాలు పల్లెలు దోచుకుని నిర్మింపబడ్డాయి. కాని గాంధిగారి సూత్రం పల్లెలు స్వయంపోషకంగా, సౌభాగ్యవంతంగా తయారు కావడమే. ప్రభుత్వంలో పల్లె ప్రజలకు సహాయం చేసేవారు లేరు. వారు ఇనుము పర్మిట్లకు అర్జీ పెట్టుకుంటే ఇనుం తక్కువగా వుంది గనుక యివ్వడానికి వీలులేదని సమాధానం వస్తే, ఎక్కువజీతం తీసికొనే సెక్రటరి దానినే సరిఅంటాడు. గాని యే పెట్టుబడిదారో సినిమాహాలు కట్టుకోవాలని కావలసిన ఇనుముకు అర్జీ పెట్టుకుని, కలెక్టరు, ఉన్నతోద్యోగుల సిఫారసులు తీసికొనిపోతే యిస్తారు. ప్రభుత్వం యీ మాదిరిగా నడిచినంతకాలం గ్రామాలకు ఉపకారం జరగదు. మన గ్రామాలకి అయినుమే యిస్తే గ్రామావసరాలకు పనికి వస్తుంది. ప్రభుత్వం యీ సహాయం చేయాలి. అందుకు గ్రామ ప్రజలు తమవోటు నిచ్చేటప్పుడు యెవరు గ్రామాలకు సేవచేస్తారు, యెవరు అర్హులు అని గుర్తించి యివ్వాలి. అప్పుడే ప్రభుత్వం మన అవసరాలను గుర్తిస్తుంది.

దక్షిణాదిలో కారెకల్ అనే గ్రామంలో 1500 జనాభా యున్నారు. వారు ఆ గ్రామంలో ఒక వైద్యునికి, ఉపాధ్యాయులకు యిల్లుకట్టించియిచ్చారు. యిలాగే దక్షిణాదిలో చాలా గ్రామాలలో వారంతవారు సౌకర్యాలు కల్పించుకున్నారు. గ్రామాలలో చక్కని నిర్మాణాలు జరిగేయి. గ్రామాలు స్వయంపోషకం కావాలంటే తిండి, గుడ్డ, ఉనికి ఉండాలి. యిప్పుడు అవి లేవంటే మన అలవాట్లే కారణం. గ్రామాలనుంచి డబ్బు పైకిపోకుండా చేయాలి. అందుకు పరిశ్రమలనువృద్ధిచేసుకోవాలి. గ్రామపంచాయతీలు నెలకొల్పాలి వీటికి పూర్తిఅధికారం ఉండాలి. యిప్పుడుండే శాసనసభలలో గ్రామావసరాలు తెచ్చుకోవాలంటే వారికి గ్రామావసరాలు తెలియవు. గనక ప్రతి ఫిర్కాకు ఒక కౌన్సిలు నిర్మించి, ఆ కౌన్సిలుకు ప్రతిగ్రామంనుంచి ఒక ప్రతినిధిని పంపించి అక్కడ నెలకొకసారైనా సమావేశమై అందు కష్టసుఖములు చర్చించుకుని శాసనసభలద్వారా వారిపనులు నెరవేర్చుకోవాలి. ప్రభుత్వ ప్రస్తుత ఆదాయం 50 కోట్ల రూపాయలు, యిందులో 8 కోట్ల రూపాయలు భూమి పన్ను కింద వసూలవుతుంది. యీ 8 కోట్లూ ప్రభుత్వం గ్రామసౌభాగ్యంకోసం ఖర్చుపెడితే గ్రామాలు స్వయంపోషక మవుతాయి. కాని యిందులో 30 కోట్ల రూపాయలు జీతాలకింద యిచ్చిస్తున్నారు. మిగిలింది ప్రభుత్వం పట్టణాల అభివృద్ధికి ఖర్చుపెట్టుతుంది గనుక చిన్నచిన్న కౌన్సిళ్లుపైన చెప్పినరీతిగా తయారుచేసి తద్వారా గ్రామాభివృద్ధి చెయ్యాలి. కాని యిప్పటి ప్రభుత్వంతో కాదు. యిందుకు మీవోటే మీకు బలం. అయితే గ్రామప్రజలు సోమారులైనారు. వారుకూడ ఆరోగ్యానికి సంబంధించిన పనులు నిర్బంధంగా చూచుకుంటే బాగుంటుంది. అందుకనే గ్రామసేవక విద్యాలయాలు స్థాపించి, పనిద్వారా విద్య నేర్పించాలి. అప్పుడే గ్రామాలు బాగుపడతాయి. యిదే గాంధిగారి బేసిక్ విద్యావిధానం. కాన గ్రామాలలో యిదివరకే యున్న చెడ అలవాట్లు పోగొట్టుకుని, ఐకమత్యంతో సంఘం నిర్మించుకుని, కక్షలకు స్వస్తి చెప్పి సుహృద్భావంతో మెలగాలి. అందుకనే ఈ విద్యాలయంలో తర్బీయదు నిస్తారు, యీమాదిరి ఆశ్రమాలకు సహాయంచేయండి. ఆశ్రమ నిర్వాహకులు వీరబ్రహ్మం, రామలింగారెడ్డిగార్లు అభినందనీయులు. గాని వారు చెప్పేరీతిని అమలుపరచి, ఆశ్రమాని నిలపెట్టుకుకోవడుకు విరాళాలిచ్చి, యీ ఆశ్రమమే కేంద్రంగా పెట్టుకుని యీ ఫిర్కా ప్రజలంతా విద్యావిజ్ఞానం సంపాదించుకుని గ్రామాలను స్వయంపోషకంగా చేసుకోండి.

తరువాత ఆర్. కె. రామలింగారెడ్డి, పన్నల కొండారెడ్డి, వెంకట్రామయ్యగార్లు గ్రామసేవకులను, తర్బీయదుపొంది గ్రామానికి సేవచేసి, ఐకమత్యాన్ని పెంపొందించుకోమని ప్రసంగించారు.

తర్వాత వీరబ్రహ్మంగారు చాపాడు ఫిర్కా గ్రామసేవాసంఘం యీ సంవత్సరంలో చేసిన కృషిని తెలియపరచినారు. ఈ ఫిర్కాను గ్రామాభివృద్ధి ప్రణాళికలో చేర్చవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుచూ తీర్మానము చేసినారు. (స్వ. వి.)

# టిబెట్‌కు చైనాకమ్యూనిస్టులవల్ల ప్రమాదం

## బ్రిటిష్ ప్రభుత్వవైఖరి

లండన్, డిసెంబరు 28: 'టిబెట్‌లోకి చైనాకమ్యూనిస్టులు ప్రవేశిస్తే బ్రిటన్ ఎటువంటివైఖరి అనుసరిస్తుంది?' అని టిబెట్ ప్రభుత్వం బ్రిటిష్ ప్రభుత్వాన్ని అడిగినట్లు విశ్వసనీయవర్గం ద్వారా ఈ వేళ తెలియవచ్చినది, ఢిల్లీలోని బ్రిటిష్ హైకమిషనర్ ద్వారా ఈ సందేశం బ్రిటిష్ ప్రభుత్వానికి అందజేయబడినదని, దానిని అక్కడ చర్చిస్తున్నారనీ తెలిసినది.

టిబెట్ సమస్యను కొలంబోలో జరగబోయే కామన్వెల్తు విదేశాంగమంత్రుల సభ కార్యక్రమంలో చేర్చకపోయినప్పటికి, బెవిన్ అందులో టిబెట్ సమస్యను ప్రతిపాదించవచ్చునని ఇక్కడి రాజకీయ వర్గాలు భావిస్తున్నారు. టిబెట్ ఆంతరంగిక స్వాతంత్ర్యానికి భంగంకలగనిపద్ధతిలో దీనిమీద చైనా సార్వభౌమత్వం ఉండటానికి బ్రిటన్ అంగీకరిస్తున్నది.

# ఆంధ్ర వెల్ఫేర్ అసోసియేషన్‌వారి నాటకం

చన్నపట్నం, డిసెంబర్ 29: ఆంధ్ర వెల్ఫేర్ అసోసియేషన్ అధ్యక్షుడు శ్రీమాన్ యస్. వి. రంగాచార్యులుగారు యిట్లా వ్రాశారు:

ఆంధ్ర తుఫానుబాధితుల సహాయార్థం ఈసంఘమువారు ఈ నెల 20 తేదీ సెయింటుమేరీస్ హాలులో ప్రదర్శించుటకు యేర్పాటుచేసిన "దాసుదాసు" నాటకం అనివార్య కారణాలచే ఆపు చేయబడినది. ఆ విషయం ఆదినపత్రికలలో ప్రచురించితిమి.

తిరిగి ఆనాటకమే జనవరి మొదటివారంలో ప్రదర్శించుటకు యేర్పాట్లు జరుగుచున్నవి. ఇంత ఆలస్యమునకు కారణము నాటకము ప్రదర్శించుటకు హాలు లభ్యము కాకుండుటయే. నాటకము ప్రదర్శించు తేదీ స్థలము మొదలగు వివరములు అతిత్వరలో ప్రచురింపబడును. టిక్కెట్లు కొనిన వారికి, యిందువలన కలిగిన అసౌకర్యమునకు చింతిల్లుచున్నాము. లోగడ కొన్న టిక్కెట్లు జనవరి మొదటివారములో వేయబడు "దాసుదాసు" నాటకము నకు చెల్లుబడియగును.

# ఒక క్రొత్త దేశీయ పరిశ్రమ ఉద్భవము



వకోలా, శాంతాక్రుజ్, బొంబాయిలోని స్టాండర్డ్ బ్యాటరీ ఫ్యాక్టరీ ఎదుటి దృశ్యము.

## భారతదేశపు మొట్టమొదటి ఆటోమేటిక్ యంత్రపు-తయారు బ్యాటరీలు

పారిశ్రామిక బొంబాయి నగరపు సమీపమునగల శాంతాక్రుజ్‌వద్ద నున్న స్టాండర్డ్ బ్యాటరీస్ లిమిటెడ్ వారి క్రొత్త యంత్రములకు సుమారు 8 సం|| క్రితము పవరు స్విచ్ చేయబడినప్పుడే భారత దేశపు పారిశ్రామిక స్వయంసమృద్ధికిగాను ఒక స్థిరమగు ప్రముఖ ప్రయత్నము ఆరంభింపబడినది.

భారత దేశములో మొదటిసారిగా ఫ్యాక్టరీలో అత్యంత ఆధునిక ఆటోమేటిక్ యంత్రములను, ప్రిసిషన్ కంట్రోల్ పద్ధతులను ఉపయోగించి మోటారుకార్లు, రైల్వే లైట్లు, టెలిఫోనులు, టెలిగ్రాములు, వాయువిమానములు ఓడలు, మొదలగు వాటికి, మరి యితర ప్రత్యేక ఉపయోగములకు అవసరమయ్యే బ్యాటరీలను తయారుచేయుట మొదలుపెట్టినారు.

ఈ ఆధునిక యంత్రకూటమి క్రమంగా వృద్ధిచేయబడుచున్నది. నవీన యంత్రములు చేర్చబడుచున్నవి. ఆధునిక సాంకేతిక పద్ధతులు ఆచరణలోనికి తేబడుచున్నవి. ఈ దేశీయ పరిశ్రమవల్ల యిప్పుడు విదేశములనుండి బ్యాటరీల దిగుమతులు అనవసరమగుచున్నవి.



బ్యాటరీ ఎసెంబ్లీ లైన్‌యొక్క దృశ్యము.

## ప్రకటన

...ండ్యాలలో (కర్నూలు జిల్లా), మా ఆంధ్ర దైనిక, సచిత్ర వార, భారతి మాసపత్రికలను వారి స్వంత బాధ్యతపై విక్రయించుటకు శ్రీ సెరవేటి సుబ్రహ్మణ్యంగారి స్థానే శ్రీ హోశీ దాదామియా గార్ని తే 1-1-50 దీ నుండి నియమించడమైనది.

* * *

తెనాలిలో (గుంటూరుజిల్లా), మా ఆంధ్ర దైనిక, సచిత్రవార భారతి మాసపత్రికలను వారి స్వంత బాధ్యతపై విక్రయించుటకు శ్రీ రాముడుగు వెంకటేశ్వరరావుగారి స్థానే శ్రీ చల్లా శేషరామానుజాచార్యులుగారిని తే 1-1-50 దీ నుండి నియమించడమైనది.

మేనేజరు,
ఆంధ్రపత్రిక జి. టి. మద్రాసు

## గంటల పంచాంగం

విరోధి సం॥ పుష్య శు॥ ఏకాదశి 1949 సం॥ డిసెం॥ 31 శనివారం శు॥ ఏకాదశి ప 9-9 కృ 24 0 వర్జ్యం రా 7 41 ల 8-27 కు. వైకుంఠ ఏకాదశి.

విరోధి సం॥ పుష్య శు॥ ద్వాదశి 1950 సం॥ జనవరి 1 ఆదివారం శు॥ ద్వాదశి ప 11-1 కృ॥ 8-56 వర్జ్యం రా 2 8 ల 3-51 కు.

# ఆంధ్రపత్రిక

విరోధి నం॥ పుష్య శు॥ ఏకాదశి
శనివారం

## "తాత్కాలిక" రాజధాని

అన్నిహంగులతో రాజధానీ నగరము ఏర్పడువరకు ఆంధ్ర ప్రభుత్వ కార్యాలయములు చెన్నపట్నములో వుండవచ్చునని తమిళ నాయకులు అంగీకరించుటవలన తాత్కాలిక రాజధాని సమస్య పరిష్కారము సుకరమైనట్లు కన్పించుచున్నది. కాని ఆంధ్ర శాసనసభ సమావేశములు తాత్కాలిక రాజధానీ నగరముననే జరుగవలెనని తమిళనాయకులు షరతులు విధించుటవలన రాజధానీ నగర నిర్మాణమునకు ఆంధ్రప్రభుత్వము తక్షణము పూనుకొనవలసిన అవసరము కలుగుచున్నది. రాష్ట్రశాసనసభ సమావేశములు జరుగు ప్రదేశముననే అసెంబ్లీ కార్యాలయము వుండుట యవసరము; వాంఛనీయము. ఆంధ్ర నాయకులు నేడు నిర్ణయించు తాత్కాలిక రాజధాని నగరమునందు శాసనసభ సమావేశములకు, అసెంబ్లీ కార్యాలయమును ఏర్పాటుచేయుటకు అనువైన భవనములు వుండవలెను లేక తక్షణ ప్రథమ శాసనసభ సమావేశమగు నాటికి భవనముల నిర్మాణము పూర్తి కావలసియుండును.

ఆంధ్రశాసనసభయందు గణనీయమైన ప్రతిపక్షము లేకపోయినప్పటికిని, ఆచార ప్రకారము 'బడ్జెట్' సమావేశము దాదాపు రెండు మాసములు జరుగవలసియుండును. ఆకాలమున మంత్రివర్గ మొకచోట, ప్రభుత్వ కార్యాలయములు వేరొకచోట ఉండుటవలన పరిపాలనా నిర్వహణ సాఫీగా, సమర్థతతో జరుగుట దుర్లభము. కనుక ఆ రెండుమాసములైనను ప్రభుత్వ కార్యాలయములు ఉంచుటకు భవనములు కావలసియుండును. ఆంధ్ర నాయకులు నిర్ధారణ చేయు రాజధానీ నగరమునందు ఇట్టి వసతులు లేకున్న, తాత్కాలికావసరమున కైనను, భవనములు నిర్మించుకొనవలసియుండును. ఈ విధముగా తాత్కాలిక ఏర్పాటుల కైనను భవనములవసరమే. నగరమును రాజధానిగ ఆంధ్ర నాయకులు నిర్ణయించిన, ఆ తాత్కాలిక రాజధానియందు, తాత్కాలిక ఏర్పాట్లు చేసుకొనుటకు యాభైలక్షల రూపాయిలకు తక్కువ లేకుండ ఖర్చు చేయవలసియుండును.

ఈ ప్రకారము తాత్కాలిక రాజధానియందే ప్రభుత్వ కార్యాలయము లన్నింటికి అవసరమైన భవనములను నిర్మించుకొనుట అవసరమగును. భవనములు నిర్మాణమైన తరువాత ప్రభుత్వ కార్యస్థానము, హైకోర్టుకూడ ఆ తాత్కాలిక రాజధానికి మారుట తప్పనిసరియగును. కనుకనె తమిళనాయకులు ప్రభుత్వ కార్యాలయములు, హైకోర్టు మద్రాసునందుండవచ్చునని చెప్పి శాసనసభ సమావేశములు మాత్రము ఇక్కడ జరుగరాదని షరతుపెట్టిరి. ఆంధ్రనాయకులు ఈ తాత్కాలికపు ఏర్పాటుకు తృప్తిచెందినట్లు కన్పించుచున్నది. ప్రభుత్వ కార్యాలయములు 'చెన్నపట్టణము' నందే యుండవచ్చును గనుక ఏనగరమునైనను తాత్కాలిక రాజధానీ నగరముగ నిర్ణయింపవచ్చునని వీరు భావించుచున్నట్లు కన్పించుచున్నది. కాని ఈ సమన్వయము అంత సులభమైనదిగాదు. అన్ని హంగులతో రాజధానీనగరము ఏర్పడువరకు చెన్నపట్టణముననే ప్రభుత్వ కార్యాలయము లుండుటకు తమిళ నాయకులు సమ్మతించినప్పటికిని ఏ క్షణములోనైనను తాత్కాలిక రాజధానికి కార్యాలయములను మార్చుకొనవలసిన పరిస్థితులు ఏర్పడవచ్చునను భావముతోనె నాయకులు ఈ రాజధానీ నగరమును నిర్ధారణ చేయవలసియుండును. తాత్కాలిక ఏర్పాటుకు లక్షలకొలది రూపాయిలు ఖర్చుచేయవలసిన అవసరము ఉండని ప్రదేశమును రాజధానీ నగరముగ నిర్ణయించుకొనుట వివేకుల లక్షణము.

## పాకిస్థాన్‌నుండి హిందువుల వలస

### నానాటికి హెచ్చుచున్నది

బొంబాయి, డిసెంబరు 29: పాకిస్థాన్ నుండి వచ్చు శరణాగతులసంఖ్య నానాటికి హెచ్చుచున్నది. నేడు 24 గురు 'ఎస్. ఎస్. సరస్వతి' లో పాకిస్థానునుండి బొంబాయి వచ్చిరి. గతివార మొకజట్టు ఆ క్రిందటి వారమొక జట్టు బొంబాయి వచ్చియుండెను. ఈ మూడు జట్లలో మొత్తం 54 గురు కలరు. నేడు వచ్చిన వారు ఉత్తర సింధు జిల్లాలకు చెందిన వారు. పాకిస్థాను ప్రభుత్వము తమ ఆస్తులను నశింపచేయుటవల్ల తాము దరిద్రులైరని, తాము భారతదేశము వచ్చుటకిదియే కారణమని నేడు వచ్చిన శరణాగతుల ప్రతినిధి చెప్పెను. ఈ శరణాగతులను నాసిక్ వద్దనున్న మార్ట్రోల్ శిబిరమునకు పంపెదరు.

## వినోబాభావే అస్వస్థత

### ఔషధసేవకు నిరాకరణ

వార్ధా, డిసెంబరు 30: ఇక్కడికి వారంరోజులనుంచి ఆచార్య వినోబాభావే అస్వస్థులుగా వుంటున్నారు. జీర్ణకోశంలో వ్రణాలులేచి బాధపడుతున్నారు. మజ్జిగతప్ప మరేయితర ఆహారమూ తీసుకోవటంలేదు.

ప్రకృతి చికిత్సలో విశ్వాసంకలవారు కోటం చేత వినోబాభావే వైద్యసహాయం తీసుకోవటానికి నిరాకరించారు. 'నేను బ్రతుకు భగవంతుని యిచ్ఛ గనుక అయినట్లయితే నేను జీవించేవుంటాను. నా ఉద్యమాన్ని కొనసాగించుతూనే వుంటాను. నా వ్యాధి దానంతట నివారణ అవుతోంది' అని నిన్న నాగపూర్‌నుంచి చూడవచ్చిన కొంతమంది ప్రజలతో అన్నారు.

## కాశ్మీర్ సమస్య: మెక్నాటన్ ప్రతిపాదన

1-వ పేజీ తరువాయి

చూచేనిమిత్తం, ఉభయ ప్రభుత్వాల ఒప్పందంతో, సమితి కార్యదర్శి ఒక పర్యవేక్షకుని నియమించవలెను. మెక్నాటన్ ప్రతిపాదనలో చెప్పబడిన అంశాల మీద, ఉభయ ప్రభుత్వాలు చేసుకున్న ఒప్పందాలకు అన్వయం ఏమిటో నిర్ణయించి చెప్పే అధికారం ఈ పర్యవేక్షకునికి ఉండగలదు.

(5) ఉత్తర కాశ్మీర్ ప్రాంతానికి కూడా ఈ సైనికోద్వాసన కార్యక్రమం వర్తించవలెను. ప్రస్తుతం అక్కడవున్న స్థానికాధికారులే పరిపాలన నిర్వహించవచ్చును. కాని దానిమీద సమితి పర్యవేక్షణ ఉండవలెను.

(6) సమితి పర్యవేక్షకుడికి సంతృప్తికరంగా సైనికోద్వాసన పూర్తి అయినప్పుడు జనవాక్య నిర్వాహకుడు ఎడ్మిరల్ నిమిట్స్ తన కార్యక్రమానికి ఉపక్రమిస్తాడు.

### సంప్రదింపుల వివరణ

జనరల్ మెక్నాటన్ ఇండియా, పాకిస్థాన్‌లతో తాను జరిపిన సంప్రదింపులను వివరించి, తన ప్రతిపాదనలకు ఒక దేశం నిన్న సమాధానం పంపినదనీ, రెండవ దాని సమాధానం ఈ వేళనే అందినదనీ వెల్లడించాడు. ఉభయ దేశాలూ ఆలోచించుకొనటానికి వ్యవధి అవసరమని అతడు అన్నాడు.

నేటి సమావేశంలో సభ్యులందరితో పాటుగా ఇండియా పాకిస్థాన్ ప్రతినిధులు, మధ్యవర్తి సంఘ ప్రస్తుతాధ్యక్షుడు డా॥ ఒల్డ్రిచ్ కైల్ పాల్గొన్నారు.

జనరల్ మెక్నాటన్ తన ప్రసంగంలో ఈ క్రింది అంశాలను వెల్లడించాడు:

"కాశ్మీర్ సమస్యాపరిష్కారమార్గాన్ని శోధించే నిమిత్తం ఇండియా పాకిస్థాన్ ప్రతినిధులను విడివిడిగా అనేక సార్లు కలుసుకుని సంప్రదించాను. ఆ సంప్రదింపుల ఫలితంగా, ఉభయ ప్రతినిధులు కోరినమీదట, ఉభయ ప్రభుత్వాలకూ లిఖిత పూర్వక ప్రతిపాదనలు చేయటానికి అంగీకరించాను. ప్రతిపాదనలను తయారు చేసేటప్పుడు ప్రతి అంశాన్ని ఉభయ ప్రతినిధులతోనూ సంపూర్ణంగా చర్చించాను. ప్రతిపాదనలను భద్రతామండలి సభ్యులకుకూడా తెలియజేశాను. జనవాక్యాన్ని ఏవిధంగా నిర్వహించాలి, దానికి నెరవేరవలసిన షరతులు ఏమిటి అన్న విషయాలను నేను ప్రధానంగ ఆలోచించాను.

'ఈ సూత్రాన్ని మొట్టమొదట ఇండియా చాల దూరదృష్టితో చేసినది. తరవాత పాకిస్థాన్‌కూడ దానిని ఆమోదించినది. ఎవరు తప్పుచేశారు, ఎవరు చేయలేదు అనే అంశాన్ని, తదితర అంశాలనూ గురించి నేను తీర్పు చెప్పటంలేదు. కేవలం జనవాక్య నిర్వహణకు అవసరమైన అంశాలనే నేను ప్రస్తావించాను. వెనకటి వివాదాలనుగురించి చెప్పటంకన్నా ముందు సమాధానం గురించే ప్రయత్నించాను.

### వివాదాంశాలు

ఉభయప్రతినిధులతోనూ జరిపిన సంప్రదింపులవల్ల, ఉభయ దేశాలకూ ఈ కింది మూడు అంశాలే ముఖ్య వివాదకారణాలని తెలిసినది (1.) అజాద్ కాశ్మీర్ సేన, (2.) సైనికోద్వాసన (3.) ఉత్తర కాశ్మీర్ (గిల్గిట్) ప్రాంతం.

మధ్యవర్తి సంఘం మూలంగా చేసిన సూచనలు తిరస్కరించే ఉభయ ప్రతినిధులతో సంప్రదించిన మీదట అభిప్రాయపడ్డాను ఏ ప్రాంతం విషయంలో నయినా ఒప్పందం కుదరక పోయినదంటే దానికి కారణం సైనికోద్వాసన కార్యక్రమం విషయమై ఒప్పందం కుదరక పోవటమే నని నేను భావించాను. జనవాక్యానికి ముందుగా సైనికోద్వాసన జరగటం అవసరమని నేను గుర్తించాను. సైనికోద్వాసన జరిగిన తరవాత జనవాక్య నిర్వాహకుడు తన కార్యక్రమం ప్రారంభిస్తాడు.

ఆజాద్ కాశ్మీర్ సైన్యం, ఉత్తర కాశ్మీర్, కాశ్మీరు ప్రస్థాన భద్రత, శాంతి భద్రతల రక్షణ, ప్రజలకు వాక్స్వాతంత్ర్యం, మొదలైన ముఖ్యాంశాలను శ్రద్ధతో పరిశీలించును.

### ఉభయ దేశాల కర్తవ్యం

ఈ సంప్రదింపుల కాలంలో ఇండియా పాకిస్థాన్‌ల ప్రతినిధులు నేను సృష్టిన విషయాలమీద చూపిన ఆసక్తికి కృతజ్ఞుణ్ణి. భద్రతా మండలి ఎవరిని నిర్ణయిస్తే వారి ఆధ్వర్యం క్రింద ఉభయ దేశాలు సంప్రదింపులు కొనసాగించి సమాధాన పథానికి ప్రయత్నించటమే మిగిలి ఉన్నది. దానికి నేను చేసిన ప్రతిపాదనలు తోడ్పడగలవని ఆశిస్తున్నాను."

### చర్చ

నార్వే ప్రతినిధి సుండ్ మాటాడుతూ భద్రతా మండలి అధ్యక్షపదవి ముగిసిన తరవాత కూడా జనరల్ మెక్నాటన్ సంప్రదింపులకు ఆధ్వర్యం వహించటం మంచిదని సూచించాడు.

ఫ్రాన్స్ ప్రతినిధి కొ... ఆన్నాడు, ఇండియా, పాకిస్థాన్‌ల సమాధానాలు రానంతవరకు తమ అభిప్రాయాన్ని సూత్ప్రదగా సూచించగలనని అన్నాడు ప్రతిపాదనలు ఒకటంతటికి కుదరటానికి యోగ్యంగా ఉన్నవని అన్నాడు.

ఫ్రెంచి ప్రతినిధి షోవెల్ ప్రసంగిస్తూ మెక్నాటన్ ప్రతిపాదనలను తాను సమర్థిస్తున్నానని అన్నాడు. మెక్నాటన్ ఆధ్వర్యాననే ఇంకా సంప్రదింపులు కొనసాగాలని నార్వే ప్రతినిధి చేసిన సూచనను సమర్థించాడు.

అమెరికా ప్రతినిధి గ్రాస్ మాట్లాడుతూ మెక్నాటన్ ప్రతిపాదనలు న్యాయంగా ఉన్నవనీ, అవసరమైన మార్పులకు వీలుగా ఉన్నవనీ అన్నాడు. మెక్నాటనే సంప్రదింపులకు ఇంకా ఆధ్వర్యం వహించటం మంచిదని అన్నాడు. చైనా ప్రతినిధి సియాంగ్ దీనిని సమర్థించాడు.

సోవియట్ ప్రతినిధి మాలిక్, సైనికోద్వాసన కార్యక్రమ పరిశీలనకు సమితి పర్యవేక్షకుడు ఉండవలెనని మెక్నాటన్ చేసిన సూచనను విమర్శించాడు. మెక్నాటనే ఇంకా సంప్రదింపులకు ఆధ్వర్యం వహించాలన్న సూచనను కూడా అతడు విమర్శించాడు. ఈ సూచనలు సమితి ప్రణాళికకే విరుద్ధమని అన్నాడు.

"అన్నిటికన్నా ముఖ్యమైన విషయం ప్రతిపాదనలను ఉభయపక్షాలూ పరిశీలించటం. అదికానిదే భద్రతామండలి కలగచేసుకుంటే ఇరుకునపడుతుంది.

సైనికోద్వాసన కార్యక్రమం పూర్తిగానే అడ్మిరల్ నిమిట్స్ 1949 జనవరి 5 వ తేదీన, మధ్యవర్తిసంఘ తీర్మానంలో వివరించబడ్డవనులకు పూనుకోవాలని మెక్నాటన్ ప్రతిపాదించటం భద్రతా మండలి అధికారాలపట్లోని రాజనటమే. జనవాక్యనిర్వాహకుని కర్తవ్యాలను నిర్ణయించే అధికారం భద్రతామండలిదే. మెక్నాటన్ పదవిముగిసిన తరువాతకూడ మధ్యవర్తిగా ఉండటం పూర్తిగాక్రమ విరుద్ధమైన"అని మాలిక్ విమర్శించాడు.

బ్రిటిష్ అమెరికన్ ప్రతినిధులు సోవియట్ విమర్శలను ప్రతిఘటించారు.

జనరల్ మెక్నాటన్ చర్చకుసమాధానమిస్తూ ప్రస్తుతమండలి అధికారం ఉన్నంతవరకూ పనిచేస్తానని అన్నాడు.

పాకిస్థాన్ ప్రతినిధి జఫ్రుల్లాఖాన్ జనరల్ మెక్నాటన్‌ను ప్రశంసించి సంప్రదింపులు కొనసాగించటానికి సంసిద్ధత తెలిపాడు. భద్రతామండలిని మళ్ళీ సమావేశపరచే అవసరంవుంటే జనవరి 1 వ వారం తర్వాత సమావేశపరచమని అతడు సూచించాడు.

భారతప్రతినిధి సర్ బెనెగల్ నరసింగరావు జనరల్ మెక్నాటన్‌ను ప్రశంసించాడు. కాని ప్రతిపాదనలమీద ఏమీ వ్యాఖ్యానించలేదు.

మెక్నాటన్ తిరిగి సమాధానమిస్తూ జనవరి 1 వ సమావేశంవిషయమై సర్ జఫ్రుల్లా చేసినసూచనను కొత్తఅధ్యక్షుడు పరిశీలించగలడనిచెప్పి సమావేశాన్ని వాయిదా వేశాడు.

(7) సైనికోద్వాసన కార్యక్రమాన్ననుసరించి కాశ్మీర్, జమ్మూలలో శాంతిభద్రతల రక్షణకు అవసరమైనవి తప్ప అదనంగా ఉన్న పాకిస్థాన్ ఇండియాల సేనలు ఉపసంహరించబడాలి ఒకపక్కన కాశ్మీర్ సంస్థానసేనలనూ, మరొకపక్కన అజాద్ కాశ్మీర్ సైన్యాలనూ, నిరాయుధులుగాచేసి, రద్దుచేయాలి.

(8) 1950 జనవరి 31 లోపుగా ఇండియా, పాకిస్థాన్‌లు ఈ కింది అంశాలపై ఒప్పందానికి రావాలి.

(ఎ) పాకిస్థాన్ ప్రభుత్వం తన ప్రాంతంనుంచి కానీ, ఏ మార్గంలోనుంచికానీ, కొండజాతులు కాశ్మీర్‌మీదికివచ్చి పడి కండాకట్టుదిట్టాలు చేస్తానని భారతప్రభుత్వానికి సంపూర్ణమైన హామీని ఇవ్వాలి దీనికై చేసున్న ఏర్పాట్లను పాకిస్థాన్ ప్రభుత్వం సమితి ప్రతినిధికి ఒకరీతి ఎప్పటికప్పుడు తెలిపి, ఆయనను సంతృప్తికలిగించాలి.

(బి) యుద్ధవిరమణ హద్దు అతిక్రమించబడదని ఉభయ ప్రభుత్వాలు పరస్పరం హామీ ఇచ్చుకోవాలి.

(సి) సైనికోద్వాసన సూత్రాలమీద ఉభయులూ ఒప్పందం చేసుకోవాలి

(డి) శాంతిభద్రతల రక్షణకు కనీసావసరాలు ఎంతో ఉభయులు నిర్ణయించుకుని, అవి ఎట్లాఉండవలెనో కూడ నిర్ణయించుకోవాలి.

(ఇ) రెండవ పేరాలో సూచించబడిన ప్రమాణాకు సైన్యాల తగ్గింపు జరగవలసిన తేదీ గురించి ఒప్పందం జరగాలి.

(ఎఫ్) ఆపేరాలోనే సూచించిన విధంగా సైన్యాలను తగ్గించి పంపడానికి గాను తీసుకోవలసిన క్రమచర్యలపై ఒప్పందం జరగాలి

4. ఉభయ ప్రభుత్వాల సమ్మతితో ఐక్యరాజ్య ప్రధాన కార్యదర్శి నియమించే ప్రతినిధి నిష్పయనిక చర్యలు తనిఖీచేసి సంధిపరివారు ఇరుపక్షాల ప్రజలకు అర్థయం ఇస్తాడు. 3 వ పేరాలోని చివరి 4 అంశాలకు సంబంధించిన ఒప్పందాల భావ్యం నిర్ణయిస్తాడు.

5 ఐక్యరాజ్య ప్రతినిధికి తృప్తికరంగా నిష్పయనిక చర్యలు పూర్తి ఆయిన అనంతరం జనవాక్య నిర్వాహ అధికారి జనవాక్య నిర్వహణ ఉపక్రమిస్తాడు

6. కాశ్మీరు సమస్యా పరిష్కారానికి ప్రకటించే సూచనలను ఐక్యరాజ్య ప్రతినిధి ఉభయ ప్రభుత్వాలకు చేయవచ్చును.

## కమ్యూనిస్టు ముప్పును ఎదుర్కొనుటకు విజయవాడలో ఆంధ్ర ప్రభుత్వ పోలీసు కార్యాలయం స్థాపన

### నూతనరాష్ట్రంలో శాంతిభద్రతల రక్షణ విషయమై అధికారుల చర్చలు

చెన్నపట్నం డిసెంబరు 30: శాంతిభద్రతలగూర్చి మదరాసులో కేంద్ర రాష్ట్రప్రభుత్వముల ఉద్యోగులు జరిపిన చర్చలలో ఆంధ్ర రాష్ట్రము ఏర్పడిన తక్షణమున కమ్యూనిస్టు ముప్పు ఉధృతము కాగలదను అభిప్రాయము వ్యక్తమైనట్లును యీ విషయమై విస్తృతమైన బందోబస్తు జరుగవలసినట్లును అభిప్రాయపడినట్లు తెలియుచున్నది.

ఆంధ్ర ప్రభుత్వ పోలీసు కార్యాలయము విజయవాడలో వుండి గట్టిచర్యలుతీసుకొన్నచో పరిస్థితి ఒకనెల రోజులలోనే అదుపులోకి రాగలదనియు, కమ్యూనిస్టు ముప్పు ఆంధ్ర రాష్ట్రమునకు అడ్డురానవసరము లేదనియు ఆంధ్ర నాయకులు అభిప్రాయపడుచున్నారు.

### కమ్యూనిస్టుల ఘాతుకం ఒక రైతుహత్య

మానుకోట, డిసెంబర్ 29: మానుకోట తాలూకా పెద్దిరెడ్డిగూడెం గ్రామ రైతు మల్లారెడ్డిగారిని గతరాత్రి కమ్యూనిస్టులు హత్యగావించినారు. వారి ఎల్లను దోచుకొని పరశురామ ప్రీతి గావించిరి ఇది జి. వి పార్టీఅని అధికార రీత్యా తెలుస్తున్నది.

మానుకోటతాలూకా పుల్లూరు గ్రామ కాపురస్థులు అను నరసింహారెడ్డి, వెంకటరెడ్డిగార్ల వరిప్పలను దాదాపు 600 బస్తాలధాన్యం కలవానిని కమ్యూనిస్టులు తగులపెట్టినారు. రెండునెలలనుంచి ప్రశాంతంగాఉండి తిరిగి అల్లర్లు బయలుదేరుట మూలమున ప్రజలు భీతిచెందుచున్నారు.

## ఆస్తిఅప్పుల విభజన సిబ్బంది పంపకం

### ఆంధ్ర సభ్యుల ఆంతరంగిక సంప్రతింపులు

చెన్నపట్నం, డిశంబరు 30: నేటి ఉదయం దాదాపు విభజనగురించి యిద మిత్థమని నిర్ణయములు చేయవలసియున్నది గనుక నేడు 10 గంటలకు మైలాపూరులో మద్యనిషేధమంత్రి విభజన సంఘ సభ్యుడునుఅయిన శ్రీ నీలం సంజీవరెడ్డిగారి బసలో విభజనసంఘంలోని ఆంధ్రసభ్యులైన శ్రీ ప్రకాశంపంతులు, శ్రీ కళా వెంకటరావు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగార్లు సమావేశమై దాదాపు 2 గంటలసేపు ఆస్తి అప్పులు పంపకము సిబ్బంది పంపకములో తమిళులవాదము నాటికి తాము తెలుపాలసిన ప్రతివాదములుగూర్చి సంప్రతింపులు జరిపి కొన్ని నిర్ణయములను చేసుకొన్నట్లు తెలియుచున్నది.

### నగరశాసన సభ్యులకు సూచన

ఆంధ్రరాష్ట్ర విభజన సందర్భముగా మే రాష్ట్రశాసన సభయందుండ గోరదరో తెలుపగోరుచు రెండు మదరాసు శాసనసభలందున్న మదరాసు నగర ప్రజాప్రతినిధులకు, విభజన సంఘ కార్యదర్శి లేఖ వ్రాసెనని తెలియుచున్నది. ఇట్టి వారు సుమారు 20 మందికలరు. టి. ప్రకాశం, గుంటూరు నరసింహరావు, స్పీకర్ శివషణ్ముగంపిళ్లే, ప్రతిపక్ష నాయకులు మ. ఇస్మేలు, డా॥ వి, కె. జాన్, క్రిష్టియన్ డేంటు కె వెంకటస్వామి నాయుడు గార్లు నగర ప్రతినిధులే.

### జనవరి 2 న తంతిశాఖకు సెలవు లేదు

మ్యాడిలీ, డిశంబర్ 29: ఈద్ పండుగ సందర్భంలో జనవరి రెండవతేదీ ఒక్క తపాలాశాఖకు మినహా తంతిశాఖకు సెలవు లేదని, తంతి తపాలాశాఖ డైరెక్టర్ జనరల్ లోగడచేసిన ప్రకటనను రద్దుచేస్తూ, ప్రత్యామ్నాయం యీవేళ వేరొక ప్రకటన చేశారు.

## చెన్నరాష్ట్ర విభజన సంఘ సమావేశం

### రాష్ట్ర విభజన గురించి ప్రధానమైన నిర్ణయాలు

చెన్నపట్నం, డిశంబరు 30: నేడు ప్రధాని శ్రీ కుమారస్వామి రాజాగారి అధ్యక్షతన నేటి మధ్యాహ్నం 2 గం. మంత్రివర్గ మందిరములో చెన్నరాష్ట్ర విభజన సంఘ సమావేశం ప్రారంభమయ్యెను. ఆస్తి అప్పులను గూర్చి నేడు ప్రధాన మైన నిర్ణయములు జరుగగలవు. ఆంధ్రులకు రివిన్యూను బట్టి చెన్నపట్నంలోని ఆస్తి అప్పుల పంపకంలో 31% వుచ్చుకోవలెనని తమిళులు వాదించుచున్నను కట్టకడపట జనాభా ప్రకారము 38% ప్రకారం పంపకం చేయగలరని ఆంధ్ర నాయకులు ఆశించుచున్నారు. ఆంధ్రులు రాజధానీనగర నిర్మాణానికని రాష్ట్రనిర్వహించుటకని కొన్నికోట్లు పరిహారముగాకూడా ముట్టచెప్పగలరని ఆశించుచున్నారు. చెన్నపట్నంలోని విద్యాలయాలలో కొన్ని యేండ్లవరకు ఆంధ్రులజనాభా ప్రకారము విద్యాసౌకర్యములు యిపుడున్న ఏర్పాటు ప్రకారం కొనసాగించుటకు తమిళ నాయకులు అంగీకరించవచ్చునని ఆంధ్రనాయకులు ఆశించుచున్నారు. సాలుకి రూ 500 ప్రభుత్వానికి ఫీజు చెల్లించినచో ఆ విద్యార్థి పరాయిరాష్ట్రం వాడైనపుడు వెయ్యిరూపాయలవరకు చెల్లించవలయును. చెన్నరాష్ట్రంలోని ఈ వ్యత్యాసమును ఆ విద్యార్థి ఏ రాష్ట్రమునకు చెందునో ఆ రాష్ట్రప్రభుత్వము చెల్లించవలసియుండును. అనగా ఆవిద్యాలయములలో విద్యాబోధనకగు ఖర్చులు ఆ విద్యార్థి వచ్చిన ఆయా రాష్ట్రములు భరించవలసియుండునని తమిళ నాయకులనుచున్నారు.

చెన్నపట్నంలో యిప్పటున్న సౌకర్యాలు కొనసాగించుటకు తమకు ఆక్షేపణ లేదనియు కాని తెలుగు నాయకులు ఆస్తి అప్పుల పంపకములో తాము చెప్పిన విధానము అవలంబించనిచో యీ విషయమై తాము పేచీ పెట్టక తప్పదని తమిళ నాయకులనుచున్నారు.

వైద్యాలయముల సందర్భములో కూడా యిదే వాదను అవలంబించుచున్నారు. రేపు ఎల్లుండి ప్రొద్దున్న కూడా విభజన సంఘ సమావేశములు జరుగగలవు. ఎల్లుండి మధ్యాహ్నం మదరాసు మంత్రివర్గము సమావేశమై విభజన సంఘ నివేదికపై చర్చ జరిపి ఆమోదించగలరు.

## ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సర్వసభ్య సమావేశం

### రాజాజిహాలులో 4వ తేదీ: కార్యదర్శి ప్రకటన

మదరాసు, డిశంబరు 30: అధ్యక్షులు రంగాగారు కోరినప్రకారం, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం జనరలుబాడీ సమావేశము జనవరి 4 వ తేదీ 11 గం. రాజాజీ హాలులో ఏర్పాటుచేసినట్లు శ్రీ ఓబులరెడ్డిగారు, ప్రకటించుచున్నారు. అన్ని జిల్లా ప్రతినిధి సభ్యులు రాయలసీమవారేగాక కోస్తా జిల్లాలవారుగూడ రాగోరెదరు. చాల ముఖ్యమయిన నిర్ణయములు జరుగనున్నవున అందరు సభ్యులు రావలెనని, అధ్యక్షదిగా తెలిపినందుకు విచారించుచున్నారని వారు ప్రకటించిరి

### కీ॥ శే॥ డి. వి. కృష్ణమూర్తిగారు

మదరాసు, ప్రభుత్వంలో ...బ్లిక వర్క్సు డిప్యూటీ కార్యదర్శిగానుండిన డి. వి. కృష్ణమూర్తిగారు నేడుదయం క్షయరోగాస్పత్రియందు కాలధర్మము నొందిరని తెలుపుటకు ఎంతయు విచారమగుచున్నది.

### కీ॥ శే॥ రావుసాహెబ్ పి. రంగనాయకులు నాయుడు గారు

వాల్తేరు, డిసెంబరు 28: మద్రాసు ప్రభుత్వంలో చాల కాలం డిప్యూటీ చీఫ్ ఇంజనీరుగా పనిచేసి రిటైరయిన రావుసాహెబ్ పి. రంగనాయకులు నాయుడుగారు గత మంగళవారం (27 వ తేదీ) రాత్రి 1-25 కు మరణించారని తెలుపుటకు విచారపడుతున్నాము. వీరు కొద్ది రోజుల నుండి వ్యాధిగ్రస్తులై వున్నారు. వీరికి భార్య, ఇద్దరు కుమార్తెలు వున్నారు.

## ఆంధ్రరాజధాని విజయవాడలోనే ఉండాలి

(1వ పేజీ తరువాయి)

వుండుననీ, ఒకవేళ హైదరాబాద్ నగరము కేంద్రప్రభుత్వ పాలితనగరంగా నిర్ణయించినపక్షంలో కాకతీయుల ప్రతిష్ఠకు చిహ్నమైన ఓరుగల్లు పురమును రాజధాని నగరంగా యేర్పరచవచ్చునని సూచించుట సమంజసమని కొందరు అభిప్రాయపడినారట. విశాలాంధ్ర సమస్య ప్రస్తుతం ఉద్భవించక ఆంధ్రరాష్ట్ర సమస్యకే ప్రస్తుతం ప్రాధాన్యం యిచ్చి చాలాసేపు తర్కించినపిదప ముందుముందు యేర్పడబోయే "విశాలాంధ్ర"కు ప్రధమసోపానముగా "విజయవాడనే" ఆంధ్రరాజధాని నగరుగా ఏర్పాటుచేయుట ఉచితమని అభిప్రాయపడుతూ ఈ అభిప్రాయాన్ని విభజన సంఘసభ్యులకు తెల్పుటకు సమావేశమును యేర్పాటుచేయ స్థానిక కాంగ్రెస్ వారుగా, మరికొందరు పురప్రముఖులునూ ఉద్యుక్తులైనట్లు తెలుస్తున్నది.

## ద్విభాషా ప్రాంతాల సమస్యపై త్వరలోనే సమావేశం

### పూరీలో రాష్ట్రపతి ప్రకటన

పూరి, డిశంబరు 30: ద్విభాషా ప్రాంతాలవిషయంలో ఏర్పడుతున్న సిద్ధాంతాలనుగూర్చి చర్చించే నిమిత్తం త్వరలో ఒక సమావేశం జరుగుతున్నదని డా॥ పట్టాభి సీతారామయ్యగారు నేడు వెల్లడిచేశారు.

ఈ సమావేశంలో ఇటువంటి ప్రాంతాలనుంచి వచ్చిన ప్రతినిధులు పాల్గొంటారు.

ఇవాళ్ళ ఇచ్చటజరిగిన ఒక బహిరంగసభలో మాట్లాడుతూ ఇటువంటి ప్రాంతాలలోని ప్రజల అభీష్టాలను పాలించవలసిన అవసరం ఎంతైనా వున్నది. డాక్టరుగారు అన్నారు.

భారతదేశంలో ఒక రాష్ట్రానికి ఇంకో రాష్ట్రానికి మధ్య ఎటువంటి అంతరాలు వుండవు. అల్పమైనవాళ్లు ఈ విషయాలలో తగాదాలు పడుతూవుంటారు. మనం అంతా కలిసి ఇండియాను ఏకజాతిగా దిద్దవలసివుంది.

ప్రపంచ రాజ్యాలలో మనం ఇప్పుడు ప్రకాశించాం. మన తరువాత కూడా అంకా ఇతర రాజ్యాలు ఇందులోకి వసాయి. అప్పుడు ఈ అన్ని రాజ్యాలతోను కలిసిన ఒక సమాఖ్య ఏర్పడినప్పుడు మన ప్రథమస్థానాన్ని ఆక్రమించుకుంటాం. దీనికి కారణం మనం అనుసరించిన సత్య, అహింస, మార్గాలేగాక, మన త్యాగబుద్ధి, మన సేవాతత్పరత అని చెప్పవలసి వుంటుంది. ఏక ప్రపంచ రాజ్య నిర్మాణంలో మన నాయకత్వం కోసం ప్రపంచం అంతా ఎదురుచూస్తున్నది

మన దేశంలో రెండు సంవత్సరాల నుంచి కాంగ్రెస్ పరిపాలన సాగిస్తున్నది. కాని ప్రజలలో మాత్రం ఏవిధమైన సంతృప్తి కనపించడంలేదు. ప్రజలు రామరాజ్యం అవతరిస్తుందని కలలుకన్నారు. కాని రాముడుకూడా తన కాలంలో రామరాజ్యాన్ని నెలకొల్పలేక పోయినాడు

మంత్రులు అనేవారు గొడ్డలివాదర వంటివాళ్లు, యీ గొడ్డలికర్ర ఎవరయ్యా అంటే, ప్రజలే. ఇందులో ఏ ఒకటి లేకపోయినా పని జరుగదు అందువల్ల మంత్రులను తిట్టి లాభంలేదు.

దేశంలో ఇక ఎన్నికలు వయోజన ఓటింగు పద్ధతిమీద జరుగుతాయి. అప్పుడు ఓటు అనేది ప్రజలచేతుల్లో ఒక ఆయుధంగా తయారవుతుంది అధికారానికి మూలస్తంభమై వూరుకుంటుంది. దీన్ని జాగ్రత్తగా వాడుకోవాలి. లేకపోతే ఈ ఆయుధం ప్రజలచేతుల్లో ముసలంగా తయారవుతుంది.

ప్రజలు యోగ్యతనుబట్టి ఏ ప్రభుత్వాన్ని కోరుకుంటారో, ఆటువంటి ప్రభుత్వమే దేశంలో ఏర్పడుతుంది.

సభానంతరం ప్రజలతరఫున మహంత్ మనూరాజ్ 1001 రూపాయిలు రాష్ట్రపతికి సమర్పించారు.

# రేడియో ప్రోగ్రాములు

జనవరి 1 ఆదివారం

## మద్రాసు (ఎ)

ఉ 7-30 ఉదయసంగీతం (రి) 8 ఆంగ్లమున వార్తలు. 8-15 సినిమా సంగీతం (రి) మ. 1 వి. ఆర్. చంద్ర, ఎ.వి. ఆర్. ఆర్కెస్ట్రా సహా. 1-30 ఆంగ్లమున వార్తలు. 2-15 మదరాసు (బి) వలె 3 పాలఘాట్ కె. వి. నారాయణస్వామి, వయొలిన్. 4 మదరాసు (బి) వలె. 4-30 పాశ్చాత్య సంగీతం (రి) సా 5-30 సంగీతోత్సవం, ఎలెక్ట్రిక్ రికార్డింగు 6 ఆంగ్లమున వార్తలు. 6-15 ఎన్ విశాలాక్షి పాట 6-45 ఆర్. శ్యామా పాట. 7-30 గీతమంజరి (రి) 7-45 మదరాసు (బి) వలె 8 సంగీతోత్సవం, ఎలెక్ట్రిక్ రికార్డింగు 9 ఆంగ్లమున వార్తలు. 9-15 ఆంగ్లమున ప్రసంగం 9-30 టి. పి. రాజగోపాలన్ పాట. 9-45 పాశ్చాత్య సంగీతం (రి)

## మద్రాసు (బి)

ఉ॥ 7 తెలుగున వార్తలు. 7-15 ఎం. ఎస్. సుబ్బులక్ష్మి రికార్డులు. 7-45 మదరాసు (ఎ) వలె మ॥ 1 మద్రాసు (ఎ) వలె. 1-50 తెలుగున వార్తలు. 2-15 ఆటవిడుపు నిర్వహణ: న్యాపతి రాఘవరావు. 3 మద్రాసు (ఎ) వలె. 4 కదంబం (రి) సా॥ 5-30 మద్రాసు (ఎ) వలె. 6-15 సాయం సంగీతం (రి). 6-30 గ్రామస్థుల కార్యక్రమం, ఏకలవ్య బుర్రకథ. 7 తెలుగున వార్తలు. 7-15 గీతావళి. 7-45 కుటీర కళలు, బోతిపనులు ప్రసంగం: వేదుమల్లి విశ్వనాథం. 8 మద్రాసు (ఎ) వలె 9-30 సంగీతోత్సవం. ఎలెక్ట్రికల్ రికార్డింగు.

## విజయవాడ

ఉ 7 తెలుగున వార్తలు 7-15 అయ్యగుడి రామానుజయ్యంగార్ రికార్డులు 7-30 యామున్నివరలక్ష్మి పాట 8 ఆంగ్లమున వార్తలు 8-15 విజయవాడ రేడియో ఆర్కెస్ట్రా 8-30 'ఆపన్న దేశో' రికార్డులతో కూర్చిన కథ మ 1 ఔరాపథం (రి) 1-30 ఆంగ్లమున వార్తలు 1-50 తెలుగున వార్తలు 4 పేరంటం నిత్యజీవితములో మానసిక శాస్త్రము సంభాషణ: పారపాట్లు ప్రసంగం మీరు నిజంగానమ్మక తరాబస్తీ జీవితమే మెరుగు సంభాషణ సా 5-30 మద్రాసు (బి) వలె 6 ఆంగ్లమున వార్తలు 6-30 మాలికాఫఖ్ రాజ్ రికార్డులు 6-20 గ్రామస్థుల కార్యక్రమం (మద్రాసునుండి) 7-30 యామున్నివరలక్ష్మి పాట 7-45 చిత్రవాణి (రి) 8 మద్రాసు (బి) వలె 9 ఆంగ్లమున వార్తలు 9-15 చిత్రవాణి (రి) 9-30 మద్రాసు (బి) వలె.

# ఆంధ్రరాష్ట్ర గ్రామోద్యోగుల వార్షిక మహాసభ

అంగలూరు, డిసెంబర్ 28: 'ఆంధ్రరాష్ట్ర గ్రామోద్యోగీయుల 15-వ వార్షిక మహాసభలు జనవరి 7, 8 తేదీలలో యలమంచిలి తాలూకా ధర్మవరంలో జరగవనీ, ఎప్పుడు జరిగేదీ తర్వాత ప్రకటించబడుననీ కార్యదర్శి (న్నకోట సత్యనారాయణగారు వ్రాసిరి.

# ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షా ఫలితాలు

## ఆంధ్ర విశ్వకళాపరిషత్ ప్రాంతంలో ఉత్తీర్ణులు

చెన్నపట్నం, డిసెంబర్ 30: ఈ సంవత్సరం అక్టోబరులో జరిగిన ఎస్. ఎస్. ఎల్. సి పరీక్షలలో, ఆంధ్ర విశ్వకళాపరిషత్ ప్రాంతంలో, ఈ దిగువ నంబరువారు ఉత్తీర్ణులయారు. మోడరేషన్ చేయకుండానే ఉత్తీర్ణులయినవారి నంబర్లు పదిరోజుల క్రితం ప్రకటించినారు. మోడరేషన్ చేసిన తర్వాత ఉత్తీర్ణులయిన వారివి ఈ నంబరు:

28 34 68 77 85 112 114 133 200 227 229 2[illegible]8 272 28[illegible] 287 288 307 316 321 328 331 355 338 397 400 410 413 422 425 429 446 451 468 471 489 503 515 527 529 544 545 551 553 596 602 609 610 614 616 627 728 630 640 6[illegible]4 674 688 693 711 712 719 743 765 781 782 810 817 824 829 832 837 840 864 865 8[illegible]8 938 941 947 966 975 995 1003 18 21 26 59 60 89 1112 24 36 37 49 54 75 1210 15 20 25 31 34 35 37 42 61 66 68 81 85 86 94 1301 24 49 55 64 89 98 1400 33 70 72 77 95 1518 20 27 32 54 56 66 69 74 89 1609 21 22 26 46 59 75 95 700 09 35 37 41 70 87 1811 24 36 41 50 69 76 82 98 1904 05 11 31 నుండి 33 36 38 60 61 71 88 89 91 92 97 98 2 01 07 నుండి 09 12 21 27 35 54 68 79 92 2105 45 2200 25 44 45 50 57 64 66 69 86 92 98 2802 17.

14247 257 267 278 281 297 14385 410

# ఆంధ్రరాష్ట్ర వెనుకబడిన జాతుల మహాసభ

గుంటూరు, డిసెంబర్ 20: ఆంధ్రరాష్ట్ర వెనుకబడిన జాతుల మహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షు, కార్యదర్శులు తిలాబందుల నాగేశ్వరరావు, ఉరిటి రామయ్యగార్లు ఇట్లు వ్రాసిరి:

ఈ మహాసభను ఇచ్చట వచ్చే జనవరిలో జరుప నిర్ణయించితిమి. ఆ సభకు రాజకీయ, సాంఘిక, విద్యాప్రముఖులను ఆహ్వానించి, సంఘాశయములను గూర్చి చర్చించి, తగు సలహాలను బొంది, నిర్మాణ కార్యక్రమమును నిర్ణయించి సంఘాభివృద్ధికి కృషిచేయ సంకల్పించితిమి. కాబట్టి, ఆంధ్రరాష్ట్రములోగల వెనుకబడిన జాతుల సంఘీయులును, సానుభూతిపరులగు యితర సంఘీయులును, వుదారభావముగల శ్రీమంతులును, ఆర్థిక దృష్టితోనున్న యీ సంఘముపట్ల ఆదరాభిమానములు జూపి, మహాసభ నిర్వహణమునకై విరాళములు యిచ్చి తగు సహాయము చేయుదురు గాకయని ఆశించుచున్నాము.

# ఆంధ్రరాష్ట్ర యువజన కాంగ్రెస్

పిప్పర డిసెంబర్ 25: ఆంధ్రరాష్ట్ర యువజన కాంగ్రెస్ సభ్యత్వం చేర్పించు గడువు 1950 జనవరి 31 వరకు పొడిగించటమైనదని రాష్ట్ర సంఘ అధ్యక్షులు టి. సత్యనారాయణమూర్తిగారు తెలియజేస్తున్నారు

# ఆంధ్రదేశంలో కమ్యూనిస్టు దుండగాల విజృంభణ

## ప్రభుత్వానికి రా. కాంగ్రెస్ ఉపాధ్యక్షుని హెచ్చరిక

విజయవాడ, డిసెంబరు 29: ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు ఉపాధ్యక్షుడు పి. తిమ్మారెడ్డిగారు ఆంధ్రదేశములో ఇటీవల మరలవిజృంభించి జరుగుచున్న కమ్యూనిస్టు దుండగములను ప్రదర్శించుకొని ప్రభుత్వమునకు దిగువ హెచ్చరిక చేయుచు ఒక ప్రకటన చేసిరి. ఆంధ్రదేశములో భీభత్సవ్యాప్తికి కమ్యూనిస్టులు మరలప్రారంభించిరి. ఈ వారము వారు తిరువూరు తాలూకాలో ఏడు ప్రాణములను తీసిరి. లక్ష రూపాయల ఆస్తినిదోచిరి. దావాజిగూడెంలో 80 ఎకరముల వరిపైరులను దగ్ధముచేసిరి

ఆంధ్రలో ఈ కమ్యూనిస్టు దుశ్చర్యలు ఒకసంస్థ ఆధ్వర్యమున జరుగుటలేదని, కొందరు వ్యక్తులు అకస్మికముగా ప్రదేశములో సాగించుచున్నారని తలచుటపొరపాటు. కమ్యూనిస్టు గోరిల్లా సైన్యము భారతప్రభుత్వముపై యుద్ధమును జరిపినట్లుగా ప్రభుత్వము భావింపవలెను.

అత్యాచారములు జరిగినప్రదేశములకు పోలీస్ ఇన్‌స్పెక్టర్ జనరల్ పోయి చూచిపోవుచుండుట, ప్రజలలో విశ్వాసమును కల్గింపజాలదు ప్రజలు ధైర్యము వహించినచో.

కమ్యూనిస్టుల ఆచూకీనిచ్చినవారిని, కమ్యూనిస్టు వ్యతిరేకముగా కోర్టులలో సాక్ష్యమిచ్చినవారిని, కమ్యూనిస్టు ప్రజాకోర్టులలో హత్యచేయ తీర్మానించుచున్నారు. ఈ ఉపద్రవమును ప్రభుత్వము సత్వరమే రూపుమాపవలెను.

"ఆకలితో చచ్చిపోవుట" చాలా అవమానకర సంఘటనయని రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వములు రెండును భావించి, పనిచేయుచున్నవి. ఇక, ఈ 'పట్టపగటి హత్యలు' సైనికముగా చూచీ చూడనట్లు ఊరకుండగలుగుదురు? ఈ దోపిడీలకు, హత్యలకు తామే బాధ్యతవహింపవలెనని, ప్రభుత్వము గ్రహింపగోరుచున్నాను.

కృష్ణాజిల్లాలో ప్రాణమునకు ఆస్తికి రక్షణలేదు. రాత్రి వేళల, కాంగ్రెసువారు, కమ్యూనిస్టు వ్యతిరేకులు విజయవాడలో సురక్షితముగా తిరుగుటకు జంకవలసివచ్చుచున్నది. ఇంక గ్రామముల సంగతి చెప్పవలెనా?

గ్రామస్థులకు తుపాకుల నిచ్చిన, వాటిని కమ్యూనిస్టులు లాగుకొని పోవుదురని ప్రభుత్వమువారికి భయము.—హత్యలు జరిగిన రెండురోజులకు ఈ ప్రభుత్వపు మనుష్యులు ఎక్కడనూ కనుపడరు. అరువది ఏండ్ల వృద్ధుడు డెబ్బది తుపాకి గుండ్లను కాల్చి, ఎదురుపోరాటము సాగించిన సంఘటన—ప్రజలు పూర్తిగా ఆయుధములు కలిగియున్నచో, తమ్ము తాము రక్షించుకొనగలుగుదురని సూచించుచున్నది ప్రభుత్వమువారు రైతులకు తుపాకులనైనా ఇవ్వవలెను లేక ప్రతివాన్ని దోపిడీకి బాధ్యతనైనా స్వీకరింపవలెను.

కమ్యూనిస్టుల సవాలును ప్రభుత్వము ఎదుర్కొనవలెను—లేక ఎదుర్కొనగలుగు వారికి స్థాన మివ్వవలెను ఐదుకోట్ల ప్రజలను పాలించుచున్న ప్రభుత్వము, ఒక్క జిల్లాలోని కమ్యూనిస్టులను అరికట్టలేకపోవుట కేవలము బాధాకర సత్యమే గాక, సిగ్గుచేటు. రాష్ట్ర విభజనలో నిమగ్నులైయున్న మంత్రులు, నాయకులు, ముందుగా ఈ కమ్యూనిస్టు యుద్ధమును అంతము చేయు పద్ధతుల నాలోచింపవలెను

# మునగాల, లింగగిరి పరగణాలు

## హైద్రాబాదులో చేర్చవద్దని ప్రభుత్వానికి విన్నపం

జగ్గయ్యపేట, డిసెంబరు 29: మునగాల, లింగగిరి పరగణాలను హైదరాబాదు సంస్థానంలో చేర్చవద్దని మద్రాసు ప్రభుత్వమును కోరుతూ, ఆ ప్రాంతాలలోని వివిధ గ్రామాలనుండి చేడింకా కొన్ని తంతివార్తలు పంపబడినవి.

"ప్రజాభిప్రాయమును కనుక్కోకుండా, లెక్కచేయకుండా ప్రజాప్రభుత్వం యీ విలీనచర్యను జరిపినచో చాల కష్టములు, నష్టములు వాటిల్లగలవని విజ్ఞప్తి చేస్తున్నాము సంస్థానగ్రామాలు మాకంటే అన్నివిధాలా వెనుకబడియున్నవి. అక్కడ సరియైన పరిపాలన లేదు. నిజాం ప్రాత అధికారులు, ప్రస్తుత యూనియన్ అధికారులు అక్కడ ద్వంద్వ ప్రభుత్వం సాగిస్తున్నారు. హైదరాబాదు సంస్థానం కమ్యూనిస్టులకు కేంద్రం. సంస్థానప్రభుత్వం కమ్యూనిస్టు లను అణచలేకపోతున్నది, మాకు యూనియన్ పరిపాలనలోనే తగిన రక్షణ వున్నది మమ్ము ఆ అంధకారంలో ముంచవద్దు. మా కక్కడ సౌకర్యాలేమీ లేకపోగా అన్నీ కష్టాలే కలుగుతాయి ఇక్కడ మాకు సహకారసంఘాలు, గ్రామ పంచాయతీలు బాగా అభివృద్ధిలో ఉన్నవి సంస్థానంలో కలపటం మూలాన మేము వాటిని కోల్పోతాము. మా వ్యాపారం దెబ్బతింటుంది" అని యీ తంతివార్తలు ప్రభుత్వమునకు తెలియజేస్తున్నవి

తంతివార్తలు పంపినవారు: మునగాల, లింగగిరి పరగణాల స్థానిక సహకార సంఘం, వర్తక కాంగ్రెసు, లింగగిరి పంచాయతీ కోర్టు, లింగగిరి కోఆపరేటివ్ స్టోర్స్ అధ్యక్షులు, మాధవరం, నరసింహులగూడెం, సేలమర్రి, ఆకుపాముల, గణపవరం, తాడువాయి, నాడిగూడెం, సిరిపురం, సింగవరం, బృందావనపురం, రేపాల, నరసింహాపురం, కొమరబండ, బోరకుంట్ గూడెం, తిమ్మారెడ్డిగూడెం, కొక్కిరేణి, రామసముద్రం, కేశవపురం, అంజనిపురం, రత్నవరం, జగన్నాథపురం, కలకోవ గ్రామ కాంగ్రెసుల అధ్యక్షులు.

కమ్యూనిస్టుల విజృంభణను అణచివేయుటకు బలమైన మిలిటరీ స్థావరాలుగా ఉపయోగపడుతున్న ఈ రెండు పరగణాలను హైదరాబాదులో విలీనం చెయ్యటానికి యూనియన్ ప్రజలూ తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారనీ, కనుక అలా చెయ్యకుండా యూనియన్ భూభాగంలో వుండిపోయిన సంస్థాన గ్రామాలనే యూనియన్‌లో విలీనం చేసి వారిని దుష్పరిపాలన నుండి కాపాడవలసినదనీ ప్రభుత్వానికి నచ్చచెప్పటానికైన ఈ క్రింది సభ్యులతో ఒక ప్రతినిధి సంఘం బయలుదేరుతున్నది.

నల్లపాటి వెంకటరామ నరసయ్య, పోలిశెట్టి గోపయ్య, తోట రంగనాధం, అనవళ్లి అంజయ్య, హైదమర్రి ఆత్మానందం, కందిబండ నరసయ్య, కందిబండ భీమయ్య, వి. రాములు, వి. నారాయణ, ఎన్. సత్యనారాయణ, వెంపటి అప్పయ్య, పోలిశెట్టి అప్పయ్య, యం. నారాయణ, కె. అప్పయ్య, వి. అప్పయ్య, ఉప్పల జానకిరాములు, కె. లచ్చయ్య, వెంపటి వెంకటేశ్వర్లు, మేకల లక్ష్మీనరసయ్య, కొత్త చిన సత్యనారాయణ, మాడుగుల సుబ్రయ్య, బండారు నారాయణ, సుంకరసోమయ్య, సుంకర నారాయణ, వి. చినరంగయ్య, విల్లా నరసయ్య, పోలిశెట్టి చిననారాయణ, కందిబండర తయ్య, కందిబండ వెంకటాద్రి, చలాది దయ్య, కె. లక్ష్మయ్య, పోలిశెట్టి రామానందం, కోలాని నరసు, కొల్లు కోటయ్య, కాసర్ల రామకోటయ్య, మహంకాళి సుబ్రహ్మణ్యం, పోలిశెట్టి విశ్వనాధం, కొండూరి నరసింహాచార్లు, కె. కేశవయ్య, వి. సత్యనారాయణ, కె. జానకిరామయ్య, ఎన్. పుల్లయ్య, కె. పెదనాగిరెడ్డి, వి. వెంకయ్య, డి. శ్రీరాములు, మరింగంటి వెంకట శ్రీరంగాచారి, జె. సీతారామిరెడ్డి, పి. లచ్చయ్య, వి. కోటయ్య, జి. ముత్తయ్యగార్లు.

# "కాంగ్రెసు సంస్థ ఒక విశ్వవిద్యాలయం"

## డా॥ పట్టాభి ప్రసంగం

కటక్, డిసెంబరు 29: నేడు కాంగ్రెసు అధ్యక్షుడు డా॥ పట్టాభి సీతారామయ్యగారు ఇక్కడ స్వరాజ్య ఆశ్రమములో కాంగ్రెసు కార్యకర్తల ఎదుట ప్రసంగిస్తూ, కాంగ్రెసుసంస్థ ఒక విశ్వవిద్యాలయమనీ, అన్ని జాతులవారికీ స్త్రీలకూ వివిధ శాసనసభలలో వారికి తగిన ప్రాతినిధ్యం లభించేలాగు కాంగ్రెసు రాజకీయ ప్రబోధం చేయాలనీ చెప్పారు.

స్వాతంత్ర్య సముపార్జనానంతరం కాంగ్రెసు కర్తవ్యంగురించి మాట్లాడుతూ డా॥ పట్టాభి ఈ విధంగా చెప్పారు:

"ముప్పరిష్కలుగుతుందని ముందే గ్రహించి గాంధీజీ కాంగ్రెసు 'లోకసేవకసంఘం'గా మారాలన్నారు. మొదట్లో కాంగ్రెసు రెండు కర్తవ్యాలు పెట్టుకొన్నది: బ్రిటిషువారితో పోరడటమూ, నిర్మాణ కార్యక్రమం సాగించడమూ, అందులో మొదటిపని ముగిసింది రెండవది సాగించడానికి ఆటంకాలు తొలగిపోయినవి

"ముస్లిములు స్వయంగానే ప్రత్యేక నియోజకవర్గాలనూ, ప్రత్యేక స్థానాలనూ వదలుకొన్నారు. ఇప్పుడు శాసనసభలలో వారిసంఖ్యకు తగ్గ స్థానాలు వారికి లభించేలాగు చూడాలి. వారికి అవసరమైన రాజకీయ ప్రబోధం ఇవ్వాలి. సగానికి నూటికి 8 వంతులున్న హరిజనులు సంయుక్త నియోజకవిధానంతో సంయుక్త నియోజకవర్గాల ద్వారా స్థానాలు సంపాదించుకోలేరు. నూటికి 50 వంతులున్న స్త్రీలకుకూడా నూటికి 10, 15 స్థానాలు లభించేటట్లు చూడాలి"

ఇతరవిషయాలుముచ్చటిస్తూ డా॥పట్టాభి ఈ విధంగా చెప్పారు:

మద్యనిషేధం విజయవంతం కావాలి. మద్రాసు రాష్ట్రంలో అది సమగ్రంగా అమలులో ఉన్నది. గాని దొంగసారాయి చాలా ఎక్కువగా తయారవుతున్నది. అంతమాత్రాన మద్యనిషేధం ఎత్తివేయరాదు. ఉల్లంఘించినంత మాత్రాన శాసనాలు చెడ్డవి కావు.

కాంగ్రెసువారు అస్పృశ్యతను సాంఘికంగానూ, రాజకీయంగానూ, వ్యక్తికంగానూ నాశనం చేసినారు. నిమ్నజాతులను ఆర్థికంగా పైకి తేవడంతప్ప అస్పృశ్యతను గురించి చెయ్యవలసినదేమీలేదు.

ఇటువంటిపనులన్నీ చేయడానికి కాంగ్రెసు మంత్రులకు వ్యవధిలేదు. పరిపాలనావిధానం మార్చడానికే వారికి తీరికలేదు. వారి కార్యదర్శులకు పనులు చేయకుండా ఆలస్యం చేయడం తెలిసినట్లుగా పనులు చేయడం తెలీదు. అందుచేత మంత్రులే అన్ని పనులూ చూడవలసి వస్తున్నది. ప్రభుత్వ కార్యశాఖలను పూర్తిగా సంస్కరించాలి

దీనికంతకూ ప్రజలజ్ఞానం పెంపొందించాలి. ఇదిమంత్రులవల్ల కాదు, కాంగ్రెసువల్లమాత్రమే అవుతుంది. మంత్రులను విమర్శించడం మనపని కాదు. మనం సంఘంలో దోషాలను బయట పెట్టాలి ప్రజాభిప్రాయం ద్వారానూ, శాసనాల ద్వారానూ, అమలు విధానాలద్వారానూ సంస్కరణలు జరగుతవి కాంగ్రెసు ప్రచారం ద్వారా ప్రజాభిప్రాయం ఏర్పడితే దాని కనుగుణంగా మంత్రులు శాసనాలు చేయగలరు.

దేశంలో ఒక క్రొత్తతరగతి ప్రజాసేవకులు తయారు కావాలి ప్రజాసేవకులకు విశ్వవిద్యాలయాలలో పట్టాలుగాని డిప్లొమాలుగాని ఏర్పాటు కావచ్చును. నిరక్షరత తొలగించడానికి విద్యార్థులను నియోగించాలి

ప్రస్తుతం ఉన్న న్యాయస్థానాలు అబద్ధాలకు నిలయాలు. న్యాయం అందరికీ అందుబాటులో ఉండేలాగున గ్రామపంచాయతీలు ఏర్పడాలి.

మనం కాంగ్రెసు మంత్రులను చూసి అసూయపడరాదు. కాంగ్రెసుజ్ఞానపీఠం మంత్రులు ఆదర్శాల ననుసరించడానికి లేదు. అందుచేత మంత్రులు తమ పదవులను పట్టుకొని వేలాడరు.

కాంగ్రెసు నిర్వహించవలసిన గొప్ప బాధ్యతలు చాలా ఉన్నవి. బ్రిటిషువారు ఏర్పాటుచేసి పోయిన పద్ధతులూ, సంస్థలూ, విద్యావిధానమూ వదలించుకోవాలి. పాతపద్ధతులు ఎంత త్వరగా విసర్జించుకుని కొత్తపద్ధతులు ఏర్పరచుకొంటే అంతమంచిది. రాష్ట్రప్రధాని మహాతాబు ఒక నిబంధన ఏర్పరచి ప్రభుత్వోద్యోగులందరిచేత రోజూ అరగంటసేపు నూలువడికిస్తే బట్ట కొరత ఉండదు.

స్వరాజ్యం మంత్రులది కాదు ప్రజాకోటిది. స్వరాజ్యమంటే బాధ్యత, స్వయంకృషి. ఆందోళన చెయ్యడంగానూ, నిరసించడంగానూ కాదు. ఈ దేశం మనదన్న సంగతి కూడా మనం గుర్తించలేదు మనం మహారణ్యం మధ్య ఉండి చెట్లు లెక్కిస్తున్నాం. మహా పర్వతంమీద గులకరాళ్లు లెక్కిస్తున్నాం. కాని మూర దేశాలవారు ఈ మహారణ్యాన్నీ, మహా పర్వతాన్ని పూర్తిగా చూసి ఇం

# ఇండోచైనా "స్వాతంత్ర్యం"

## ఫ్రెంచిప్రభుత్వంతో ఒప్పందం వివరిస్తూ వీట్‌నాం విదేశాంగమంత్రి ప్రకటన

పారిస్, డిసెంబరు 29: వియట్‌నామ్ విదేశాంగమంత్రి గూయన్ ఫాన్‌లాంగ్ ఈ వేళ ఇక్కడ మాట్లాడుతూ, ఫ్రాన్సు వియట్‌నామ్ కోరినవన్నీ ఇచ్చివేసిందని చెప్పారు.

ఈ విదేశాంగమంత్రి వియట్‌నామ్ సంఘానికి నాయకులు ఈ వియట్‌నామ్ సంఘము ఫ్రెంచి ప్రతినిధులు కలిసి రేపు 30 వ తేదీని జరుగబోయే అధికార ప్రదాన వివరాలు సైగాన్‌లో చర్చిస్తున్నారని తెలుస్తున్నది. రాత్రి 5 గంటలసేపు సమావేశం జరిపి ఈ ఉభయదేశాల ప్రతినిధులు కలిసి రక్షణస్థానాలు, న్యాయశాఖలు, భద్రత, విద్య, ఆర్థిక వ్యవహారాలు, వియట్‌నామ్‌లో పని చేస్తున్న ఫ్రెంచిదేశీయుల ప్రతిపత్తి మొదలైన విషయాలలో ఒక నిర్ణయానికి వచ్చారని తెలుస్తున్నది.

ఈ నిర్ణయాలను గురించి ఫ్రెంచి వార్తాసంఘం ఈ క్రిందివివరాలు ప్రకటిస్తున్నది.

(1) న్యాయస్థానాలు: వియత్నామ్ కోర్టులకు వియత్నామ్ ప్రజలపై సంపూర్ణాధికారాలుంటాయి. వియత్నామ్ ప్రజలకు, మిగిలిన ఫ్రెంచి యూనియను లోని ప్రదేశాల ప్రజలకు వచ్చే తగాదాలలో మిశ్రమ న్యాయస్థానాలుంటాయి సైగాన్, హైఫాంగులలో తప్ప మిగిలిన వియత్నామ్‌లో అంతటా వియత్నామ్ ప్రాసిక్యూటరులే ఉంటారు. ఇండోచైనాలో శాంతిస్థాపన జరిగేవరకు పై రెండు ప్రదేశాలలోను రెండు సంవత్సరాలదాకా ఫ్రెంచి ప్రాసిక్యూటర్లే ఉంటారు.

(2) పోలీసు: భద్రతా పరిపాలక శాఖలన్నీ వియత్నామీయుల చేతుల్లోనే ఉంటాయి. అయితే కొన్ని గూఢచారి శాఖలుమాత్రం ఫ్రెంచివారి అధీనంలో ఉంటాయి.

(3) సైన్య వ్యవహారాలు: వియత్నామ్‌లోని రక్షణ స్థావరాలన్నీ వియత్నామ్ అధికారంలోనే ఉంటాయి. అయితే ఈ విషయంలో ఫ్రెంచివారి కిచ్చిన అధికారాలు కేవలం ఉభయ ప్రభుత్వాల రక్షణ సమస్యకు సంబంధించినవే. ఫ్రెంచివారు దేశాతిరిక్తమైన అధికారాలు కూడా కావాలని అన్నారు. గాని, వియత్నామీయుల కోరిక ననుసరించి, వారీ విషయంలో చాలా ఉదారమైన సూచనలు చేశారని తెలుస్తున్నది.

(4) విద్యాశాఖ: ప్రాథమిక విద్య, హైస్కూలు విద్యావిధానము, వియత్నామ్ చేతుల్లోనే ఉంటాయి. ఇంకా ఉన్నత విద్యలోకూడా వియత్నామ్ అధికారం ఉంటుంది. ఒక ఫ్రాంకో-వియత్నామ్ విశ్వవిద్యాలయం స్థాపిస్తారు. ఈ విశ్వవిద్యాలయాధికారిని ఫ్రెంచి యూనియను అధ్యక్షుడు నియమిస్తాడు అయితే వియత్నామ్ ప్రభుత్వం ఈయన పేరు సూచిస్తుంది.

ఫ్రెంచి యూనియనులో అంతర్భాగాలుగా వియత్నామ్, కంబోడియా, లోస్‌లకు, స్వాతంత్ర్యం గుర్తింపబడింది. ఈ స్వాతంత్ర్య ప్రదానం డిసెంబరు 30 వ తేదీని జరుగుతుంది. ఈ అధికార ప్రదానం జరగగానే ఈ రాజ్యాలు తమకు సంబంధించిన రవాణా, రేవుసుంకాలు మొదలైన విషయాలనుగురించి చర్చించడానికి ఒక సమావేశం ఏర్పాటు చెయ్యగలవనీ, దానిలో వీటినిగురించి నిర్ణయిస్తారనీ తెలుస్తున్నది

ఈ వేళ బావ్‌దాయ్ చక్రవర్తి రాయబారిగా ఉన్న డోహాన్ న్యూఢిల్లీ వచ్చారు. అయితే ఈయనకు అధికార రీత్యా రాయబార ప్రతిపత్తి ఏమీలేదని తెలుస్తున్నది. ఈయన పండిత నెహ్రూను సందర్శించే విషయం ఇంకా నిశ్చయం కాలేదని తెలుస్తున్నది

ఫ్రెంచి వియత్నామ్ ప్రతినిధులీ వేళ ఫ్రాంసు-వియత్నామ్ ఒడంబడిక పత్రంపై సంతకాలు చేశారు. ఈ ఒడంబడిక గత మార్చిలో ఏర్పాటయింది. దీనివల్ల వియత్నామ్ ఫ్రెంచి యూనియనులో స్వతంత్రప్రతిపత్తిగల అంతర్భాగంగా ఉంటుంది.

## బావ్‌దాయ్ ప్రభుత్వ పరిగణన: అమెరికా వైఖరి

వాషింగ్టన్, డిసెంబరు 29: అమెరికా విదేశాంగ శాఖ ఇండోచైనా పరిస్థితిని జాగ్రత్తగా కనిపెడుతూ ఉన్నదనీ, బావ్‌దాయ్ ప్రభుత్వాన్ని గుర్తించాలా అన్నది లేదా ఇంకా నిర్ణయం చేయలేదనీ విదేశాంగశాఖ అధికారులు ప్రకటించిరి.

## సైగాన్‌కు బావ్‌దాయ్ రాక

సైగాన్, డిసెంబర్ 29: రేపు జరగనున్న అధికార ప్రదానోత్సవానికి హాజరవడానికిగాను వియత్నామ్ అధిపతి బావ్‌దాయ్ ఈ వేళ దలాత్‌నుంచి ఇక్కడికి వచ్చారు.

# నాగపూర్‌లో ప్రధాని నెహ్రూ కార్యక్రమం

నాగపూర్, డిసెంబరు 30: ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ రేపటి ఉదయం ప్రత్యేకవిమానంలో ఢిల్లీనుంచి బయలుదేరి, గం. 10-15 లకు నాగపూర్ చేరతారు. నాగపూర్‌లో 2 రోజుల ఊపిరి సలపని కార్యక్రమంవుంది

దిగిదిగటంతో, ప్లాట్‌ఫారమ్ మీద దళంవారు ఇచ్చే సైనిక వందనాలను స్వీకరిస్తారు. వెంటనే బయలుదేరి, ప్రపంచ సౌమనస్య సంఘసమావేశంలో ప్రసంగించటానికి గాను సేవాగ్రాం వెడతారు. మధ్యపరగణాల గవర్నరు మంగళదాసు పాక్వాసా, ఈ పర్యటనలో ప్రధాని నెహ్రూను అనుసరిస్తారు.

ప్రపంచసౌమనస్య సంఘంలోని ప్రసంగం పూర్తి అయిన తర్వాత నెహ్రూ వార్థాలో ఒక బహిరంగసభలో ప్రసంగిస్తారు. రాత్రి ప్రొద్దుపోయిన తర్వాత నాగపూర్ చేరతారు.

జనవరి 1 వ తేదీన నాగపూర్ విశ్వవిద్యాలయంలో స్నాతకోపన్యాసం చేస్తారు. అనంతరం విద్యార్థుల బృందవ్యాయామ ప్రదర్శనాన్ని పర్యవేక్షిస్తారు జనవరి 1 వ తేది కార్యక్రమంలో ఒక బహిరంగసభ, ఒక పత్రికావిలేఖరుల గోష్ఠి, కాంగ్రెస్ కార్యకర్తల సమావేశం కూడా వున్నయ్.

2 వ తేది: ఉదయం సైనిక ప్రస్థాన ప్రదర్శనం, మధ్యపరగణాల ప్రత్యేక సాయుధదళానికి గౌరవచిహ్నాల బహూకరణ గం 8.40 లకు విమానంలో బయలుదేరి పూనా వెడతారు. అక్కడ భారత శాస్త్రవిజ్ఞాన పరిషత్ సమావేశంలో పాల్గొంటారు. అనంతరం జాతీయ రసాయనిక పరిశోధనాగారానికి ప్రారంభోత్సవం చేస్తారు.

## ఉక్కు యంత్రాగార నిర్మాణ నిపుణుని రాక

న్యూఢిల్లీ, డిసెంబరు 29: అంతర్జాతీయ బాంకు పంపున వచ్చేనెల వారి రాయబారవర్గంతోపాటు ఒక ఉక్కు యంత్రాగార నిర్మాణ నిపుణుడుకూడా ఇండియాకు రానున్నాడు. భారతప్రభుత్వం ఒరిస్సాలో ఒక ఉక్కు కార్ఖానాను సి. పి. లో మరో కార్ఖానాను నిర్మించవలెనని అంతర్జాతీయ బాంకును ఋణ సహాయం అడిగింది ఈ నిపుణుడు భారత ప్రభుత్వ పథకాలను పరిశీలించి అప్పు ఇవ్వవచ్చునదీ లేనిదీ బాంకుకు సిఫార్సు చేస్తాడు (ప్ర. వి.)

కెనడా విదేశాంగ మంత్రి

కరాచీ, డిసెంబరు 29: కెనడా విదేశాంగమంత్రి లెస్టర్ పియర్సన్ కొలంబో సమావేశానికి కరాచీకి వచ్చారు.

# సాయంకాలపు నిరాహారదీక్ష? → [see below]

# బొంబాయికి సర్దార్ పటేల్ ఆగమనం

బొంబాయి, డిసెంబరు 30: ఆరోగ్యకారణంగా, విశ్రాంతినిమిత్తం సర్దార్ పటేలు ఈ వేళ ఫ్రాంటియర్ మెయిల్లో ఢిల్లీనుంచి బొంబాయి చేరారు. వీరివెంట అంతరంగిక కార్యదర్శి వి. శంకర్, కుమారి మణిబెన్‌పటేలుగారు కూడా వున్నారు.

జనం గుంపుగుంపుగా వుండటాన్నిబట్టి వీరు బొంబాయి దిగువస్టేషన్ గోరేగావ్‌లో దిగి బిర్లాభవనానికి మోటారులో చేరారు

బొంబాయి ప్రధానిఖేర్, హోమ్ శాఖామంత్రి మురార్జీ దేశాయ్, గవర్నర్ అంతరంగిక కార్యదర్శి శివలాల్, బొంబాయి మేయరు యస్. కె. పాటిల్, బొంబాయి షెరిఫ్ సర్ రహీం తుల్లా ప్రధాన కార్యదర్శి భాట్, పోలీసుకమిషనర్ విలోరియో, రాష్ట్ర కాంగ్రెస్ ప్రముఖులూ పటేలు గారిని రైల్వేస్టేషనులో కలుసుకుని స్వాగతమిచ్చారు.

యస్. కె. పాటిల్ సమర్పించిన పుష్పాలను పటేలుగారు చిరునవ్వుతో స్వీకరించారు. సర్దార్ పటేలు బిర్లా అతిథిగా బొంబాయిలో వారం రోజులపాటు మకాం చేస్తారు.

# ఖర్గపూర్ వర్క్‌షాపు కార్మికుల విరాళం

ఖర్గపురం, డిసెంబరు 28: ఇచ్చటి వర్క్‌షాపు తాలూకు వర్దీ శాఖా కార్మికులు ఆంధ్రకేసరి తుపాను బాధితుల సహాయార్థం రూ 60/- లు విరాళమిచ్చారు ఇది 'ఆంధ్రపత్రిక' సహాయనిధి ద్వారా మద్రాసు గవర్నరు తుపానునిధికి అందచేయుటకు నిశ్చయింపబడినది

తరువాత డా॥ పట్టాభి భువనేశ్వరకు ప్రయాణమైనారు నేటి సాయంకాలం ఆయన అక్కడ సభలో ప్రసంగిస్తారు అటు తరువాత ఆయన పూరీకి పోతారు.

దియా ప్రపంచ నాయకత్వం వహించగలదని విశ్వసిస్తున్నారు.

ప్రపంచ రాజ్యం ఏర్పడాలంటున్నాం. కాని అది అహింసపై నిర్మాణం కావాలి. అహింస వేరు వేసే వరకూ ప్రపంచ రాజ్యానికి పునాది లేదు. అటువంటి పునాది ఇండియాలో మాత్రమే ఉన్నది.

దేశంలో అసంతృప్తి చాలా హెచ్చుగా ఉన్నది. బ్రిటిషు పరిపాలన కింద కన్నకూడా మనం హెచ్చు కష్టాలు పడుతున్నమాట నిజం కాని ఇది సంధి సమయం. ప్రజలను మార్పుకు అనుగుణంగా మార్చాలి ప్రజలు మార్పులకు సంసిద్ధులై లేగవడానికి ఒక ఉదాహరణ హిందూ స్మృతి క్రోడీకరణ బిలు.

కాంగ్రెసువారు ముస్లిం లీగు, సిక్కు మహాసభ, హిందూ మహాసభలవంటి మత సంస్థలలో చేరరాదు గాని సర్వోదయ సంఘంలో చేరవచ్చు. ఈ సంఘంవారి నియమావళిలో మొట్టమొదటిది సత్యాహింసాచరణ కనుక వీటిని పాటించని సోషలిస్టు, కమ్యూనిస్టులకు అందులో స్థానంలేదు దొంగ వ్యాపారం బ్రిటిషువారి ప్రసాదం. దానిని కాంగ్రెసు మంత్రులు తొలగించలేరు. ప్రజలు కోరుతున్నంతకాలమూ దొంగ వ్యాపారస్థులుంటారు. ఈ పీడను కాంగ్రెసువారు నిర్మూలించాలి.



# సిబ్బంది పంపకంలో అన్యాయములు

## శ్రీ వెంకటాప్పగారివద్దకు రాయబారం

చెన్నపట్నం, డిసెంబరు 29: ఆంధ్ర సెక్రటేరియట్‌కు 400 మంది సిబ్బంది కావలెనని ఉపసంఘంవారు సూచించినట్లు వార్తల తెలియుచున్నది. ఆర్గురు కార్యదర్శులు, అర్గురు డిప్టీకార్యదర్శులు, 15 గురు అసిస్టెంట్ సెక్రటరీలు అందుకవసరమని సూచించిరి. సెక్రటేరియట్ కార్యదర్శి పదవులన్నియు ఆంధ్రులైనవారికే ఇవ్వవలెననియు, ఆంధ్రేతరులైన ఐ. సి. ఎస్. వారిని కలెక్టర్లుగా వేయవచ్చుననియు ఆంధ్ర ఉద్యోగబృందములవారు తలంచుచున్నారు. పుల్లారెడ్డిగారిని ప్రధానకార్యదర్శిగను వి. కె. రావు, ఎం. టి. రాజు, జగన్నాయకులు నాయుడు, కోటీశ్వరరావు నాయుడు, హనుమంతరావు నాయుడుగారలను కార్యదర్శులుగా వేయవచ్చుననియు, ఆంధ్రేతరులను ఇతరఉద్యోగములలో పెట్టవచ్చునని కొందరువాదించుచున్నారు.

ఎం. వి. సుబ్రహ్మణ్యం వంటి అనుభవం ఉన్న 14 గురు ఐ. సి. ఎస్. ఉద్యోగులను జిల్లాలలోకి పంపేసి, కొద్ది అనుభవం గల ఆంధ్రులను కార్యదర్శులుగా వేసుకొనుట మంచిదిగాదని దానికి ప్రతిగా కొందరు తెలుపుచున్నారు. ఆంధ్ర సెక్రటేరియట్ సొంతంగా, సమర్థముగా అయిర పద్ధతులపై నడచుటకు ఆంధ్ర, ఆంధ్రేతర వ్యత్యాసము ఆదిలో కూడదని ఈవర్గము వారి అభిప్రాయమై ఉన్నది.

మాతృభాషలో పరిపాలన జరుపుకొనుటకే భాషాప్రయుక్త రాష్ట్రములని 36 సంవత్సరములుగా ఆందోళన చేసి ఉన్నామనియు, తెనుగులో ఓనమాలు రాని వారిని ఎంత పెద్ద ఉద్యోగులనైననూ తెచ్చుకుంటే మన ఆంధ్రరాష్ట్ర ప్రజాపరిపాలనా మూలసూత్రమునకే భంగము రాదా అని కొందరు అభిప్రాయపడుచున్నారు. ఇందరు ఆంధ్రేతరులైన ఉద్యోగులను మనము స్వీకరించుచున్నపుడు మనము కలలుగన్న తెనుగురాజ్యము వ్యర్థము గాదలసినదేనా అని ఒక విభజన సంఘసభ్యుని ఆంధ్రపత్రిక ప్రతినిధి ప్రశ్నించగా కొంతకాలమువరకు ప్రస్తుత పద్ధతినే నడుపుకోక తప్పదు. క్రమముగా అది మార్చుకోవలసి ఉండునని ఆయన తెలిపెను. ఆగికశాఖలో ఉన్న 65 మంది ఉద్యోగులలో 11 గురు మాత్రము తెనుగువారు ఉన్నారనియు, ఈ శాఖలోని వివిధ పనులలో అనుభవము ఉన్న పెద్ద ఉద్యోగులు ఆంధ్రులలో తక్కువగా ఉన్నారనియు, ఇందు నిమిత్తం తమిళులను కొందరిని తీసుకొనవలెనని తమిళులువాదించుచున్నారు.

పంపకములో తమిళుల ప్రాబల్యమును తగ్గించి ఆంధ్రులకు న్యాయము చేయవలెనని సెక్రటేరియట్‌లోని ఆంధ్ర ఉద్యోగులు శ్రీ వెంకటప్పగారి వద్దకు రాయబారం వెళ్లిరి. సాధ్యమైనంతవరకు తెనుగువారికే ముందు ప్రాధాన్యము ఇవ్వబడుననియు, తర్వాత ఆంధ్రరాష్ట్రమునకు వస్తామన్న ఆంధ్రేతరులైన ఉద్యోగులను తీసుకొందురనియు, ఇంకా అవసరమైనవారిని నిర్బంధసూత్రమునను సరించి తీసుకొందురనియు వారు ఉపసంఘ నివేదిక ననుసరించి అభిప్రాయపడుచున్నట్లు తెలియుచున్నది.

## రెవెన్యూ బోర్డు

ఆంధ్రదేశమునకు ఇద్దరు సభ్యులుగల రెవెన్యూబోర్డు, దక్షిణాదికి ముగ్గురు సభ్యులుగల బోర్డు అవసరమని సిబ్బంది ఉపసంఘంవారి సిఫార్సు అయిఉన్నది.

శిస్తు తగ్గింపునలకు ఇద్దరు పెద్ద రెవెన్యూ అధికారులు కావలెనగూడా వారు అభిప్రాయపడిరి. అసలు రెవెన్యూ బోర్డునే రద్దుచేసి ఇద్దరు కమిషనర్లువేసి రెవెన్యూ వ్యవహారము నడిపించవచ్చునని కొందరు రెవెన్యూ బోర్డు సభ్యులే అభిప్రాయపడుచున్నారు. రెవెన్యూబోర్డును రద్దుచేయవలెనన్న 163 చట్టములను మార్చవలసి ఉన్నదనియు, కాంగ్రెసువారు ఆదినుంచీ ఈబోర్డును రద్దు గావ్యవలెనని ఆందోళనచేసిన మాట నిజమే అయిననూ ఆంధ్రదేశములో జమీందారీ రద్దు శాసన అమలు సందర్భమున బోర్డు ప్రయోజనము అధికమని విభజన సంఘ సభ్యులు తెలుపుచున్నారు.

రెండు రాష్ట్రములకు వస్తుగ, ముగ్గురు సభ్యులుగల రెండు సర్వీసు కమిషన్లు ఉండవలెననియు, ఒక్కొక్క సంఘమునకు ఒక్కొక్క అధ్యక్షుడు ఉండవలెనని ఉపసంఘమువారు సూచించిరి.

ఇంజనీర్లలో ఒక చీఫ్ ఇంజనీరు ఆంధ్రరాష్ట్రమునకు, ఇద్దరు చీఫ్ ఇంజనీర్లు మదరాసుకు ఉండుటకు సిబ్బంది ఉపసంఘంవారు చేసిన సూచనను విభజన సంఘంవారు అంగీకరించిరి.

హరిజన క్షేమకార్యములకు ఒక గౌరవ డైరెక్టరును నియమించవలెనని గూడా ఉపసంఘము వారు సూచించిరి ఒరిస్సాలో ఉద్యోగులను తీసుకొనుటకు అనువర్తించిన నిబంధనలనే ఆంధ్ర రాష్ట్రమునకు గూడా వర్తింప చేయవలెనని సిబ్బంది ఉపసంఘం వారు సూచించిరి. జనవరి మొదటివారం నుంచే ఆంధ్ర సెక్రటేరియట్ పని చేయుటకు వీలగునట్లుగా సిబ్బంది ఏర్పాట్లు జరిగినవి. సిబ్బంది ఆంధ్రులేనా కాని నిర్ణయించుటలో "డిక్లరేషను ఫారములు" కొందరికి పంపించినారనియు, కొందరికి పంపకనే, వారి ఇష్టము ప్రకారము డిగ్రీ ఇచ్చినారనియు సెక్రటేరియట్‌లోని ఆంధ్రఉద్యోగులు అనుచున్నారు. ఆంధ్రదేశమునకు 14 గురు ఐ. సి. ఎస్. ఉద్యోగులు, 28 మంది ఐ. ఎ. ఎస్. వారిలో 11 గురు ఐ. ఎ. ఎస్. వారు రిజర్వుడ్ ఉద్యోగాలలో 38 లో 18 ఆంధ్రకు రాగలవనుచున్నారు.

జిల్లాల్లోని గెజిటెడ్ ఉద్యోగములలోను, రీజియనల్ ఆఫీసులలోను ఆంధ్రులసంఖ్య తక్కువగా ఉన్నదని సిబ్బంది ఉపసంఘంవారు అభిప్రాయపడుచున్నారు. ఐ. జి. (పోలీసు) ఆఫీసులో ఉన్న దాదాపు200 మందిలో 22 మటుకుఆంధ్రులై ఉన్నారనియు, విద్యాశాఖలోగూడా దాదాపు 150 ఉద్యోగాలలో దాదాపు 17 మందివరకు మాత్రమే ఆంధ్రులు ఉన్నారనియు అభిజ్ఞవర్గాలవారు తెలుపుచున్నారు.

రాష్ట్రం రెండుగా విడిపోయినపుడు పెదమాటము పెరిగిపోవును, గనుక ఉద్యోగాలలో 15% నుంచి 20% వరకు పెరుగుదల రాగలవనీ కొందరు తెలుపుతున్నారు. జనాభాప్రకారం మైనచో ఆంధ్ర సెక్రటేరియట్‌కు 850 మంది చాలని ఆంధ్ర ఉద్యోగులనుచున్నారు. కొన్ని రద్దు చేయవలసిన ఉద్యోగములుగూడా ఉన్నవనియు, అవసరమైనవి, అనవసరమైనవి స్థూలంగా పరిశీలించి, జనాభాప్రకారమే తీసుకొనవచ్చునని కొందరు అభిప్రాయపడుచున్నారు. జనాభా సూత్రముకన్న, అవసరమునుబట్టి నియమించి, ఆంధ్రులకే ప్రాధాన్యమిచ్చి, ఉద్యోగులు లేనిచోట క్రిందివారికి ప్రమోషన్లు ఇవ్వవలెనని ఆంధ్రఉద్యోగులు అనుచున్నారు.

## మద్రాసు కార్పొరేషను

మద్రాసు కార్పొరేషనులో 8 గురు పెద్ద ఉద్యోగులు, 50-60 దాకా చిన్న ఉద్యోగులు తెనుగువారు ఉన్నారు. ఆంధ్రప్రభుత్వములోకి తమను తీసుకోవలసిందిగా కొందరు శ్రీ కళా వెంకట్రావుగారి వద్దకు, పుల్లారెడ్డిగారివద్దకు రాయబారము వెళ్లిరి. వారిసంగతి సానుభూతితో పరిశీలించెదమని వారిరువురు తెలిపిరి. పి. డబ్ల్యు. డి. రెవిన్యూశాఖలు, వసాదు కార్యాలయములందలి ఆంధ్రోద్యోగులు శ్రీ ప్రకాశం, వెంకట్రావుగారలను చూచి, ఆంధ్రోద్యోగులు పైకిరాకుండా ఎంతోకాలముగా త్రొక్కి వేయబడిరనియు, ఆంధ్రరాష్ట్రము వచ్చుటతో ఆయినా తమ కష్టములు గట్టెక్కగలవని తాము ఆశించుచున్నామనియు వారు తెలిపిరి. సూపరింటెండెంటు ఉద్యోగములవరకు ప్రమోషను ఆంధ్రులకు సులభముగా లభింప చేయవచ్చుననియు మిగతావి వీలునుబట్టి, పర్మనెంటు సర్వీసులో ఉన్న ఉద్యోగులను బట్టి నిర్ణయించవలసి ఉండునని విభజనసంఘంలోని ఆంధ్రసభ్యులు అభిప్రాయపడుచున్నారు. శ్రీ వెంకట్రావుగారు, పుల్లారెడ్డిగారలు నిన్నను సిబ్బంది ఉపసంఘపువేదికపై చర్చలుజరిపిరి. ఆంధ్రసభ్యులు తమలో తాము సంప్రదించుకొనుచున్నారు.

సెక్రటేరియట్‌లో దాదాపు 240 మంది ఆంధ్రులువున్నారు. ఆంధ్రసెక్రటేరియట్‌కు కావలసినమిగతా సిబ్బందిని జిల్లాల్లో అణగిమణగిపడివున్న ప్రతిభావంతులను దీసుకొనవలెనని ఒకసూచన విభజనసంఘములోని ఆంధ్రసభ్యులకు చేయబడెను.

హైద్రాబాదులోను, ఇతరరాష్ట్రములోను పెద్దఉద్యోగాలలో ఉన్నఆంధ్రులను స్వరాష్ట్రానికి వస్తారేమో కనుక్కొనవలసినదిగాగూడా కొందరు ప్రముఖులు ఆంధ్రనాయకులకు సూచనలుగావించిరి. ఆంధ్ర ప్రభుత్వమునకు అవసరమైనంతవరకే సిబ్బందినితీసుకొనగలమనియు తప్పివచ్చినచో గత్యంతరంలేదనియు ఆంధ్రనాయకులు అభిప్రాయపడుచున్నారు. మూడునెలలవరకు ఈ ఏర్పాటులన్నీ తాత్కాలికముగానే ఎంచి, ఈ లోపల ఉభయప్రభుత్వముల సమ్మతితో యథేచ్ఛగా ఆయా రాష్ట్రములకు ఉద్యోగులు మారు ఏర్పాటు ఉండవలెనని ఉద్యోగబృందములవారనుచున్నారు.

## మద్రాసు యూనివర్సిటీ సప్లిమెంటల్ కాన్వొకేషన్

మదరాసు విశ్వవిద్యాలయ పట్టభద్రులకు డిగ్రీలు ప్రసాదించుట సప్లిమెంటల్ కాన్వొకేషన్ ఫిబ్రవరి 24 వ తేదీ సా. 4-30 గం. సెనేటు భవనములో జరుగును. స్వయముగా గాని గైర్ హాజరుగా గాని పట్టములను పొందదలచే వారు జనవరి 20 తేదిలోగా దరఖాస్తులు అందజేయవలెను.

# రా. స్వ. సే. సంఘ 'సత్యాగ్రహి' అరెస్టు

## జామీను ఇవ్వడానికి మేజిస్ట్రేటు నిరాకరణ

ఏలూరు, డిసెంబరు 27: రాష్ట్రీయ స్వయంసేవక సంఘమువారు సాగించిన సత్యాగ్రహం సందర్భంలో గత జనవరి 19-వ ఇక్కడ నిషేధపు ఉత్తర్వుల నుల్లంఘించి, బహిరంగసభ జరుపప్రయత్నించి క్రిమినలు లా అమెండు మెంటు చట్టం 17-వ సెక్షను ప్రకారం నేరం చేశారని, విశాఖపట్టణం ఏ. వి. ఎన్. కాలేజీలో డిమాన్‌స్ట్రేటర్‌గా పనిచేస్తున్న పి. రామారావుగారిని స్థానిక పోలీసువారు ఈనెల 24-వ తేదీని అరెస్టుచేసి, ఏలూరు స్పెషల్ సబ్ మేజిస్ట్రేటు కోర్టులో చార్జీ దాఖలు చేశారు.

కేసు నిన్న విచారణకు వచ్చినపుడు రామారావుగారు, గత జనవరిలో సత్యాగ్రహం సందర్భంలో పోలీసువారు తమను అరెస్టుచేసి 15 దినములు రిమాండునందుంచి, ఏలాటి కేసూ పెట్టకుండా బేషరతుగా విడుదలచేశారనీ, ఇపుడు మరల అరెస్టుచేయడం ఎందుకవల్లనో అంతుకాలేదనీ జామీనుమీద వదలవలసిందని కోరారు. మేజిస్ట్రేటుగారు జామీను పిటీషను నిరాకరిస్తూ, నిందితుడు ఫిబ్రవరి 25 నుండీ పరారీలో ఉన్నాడనీ ఎన్నిసార్లు సమనులు, వారంట్లు జారీచేసినా దొరకలేదనీ, అందువల్ల జామీను నిరాకరింపబడినదనీ ఉత్తరువు చేశారు. నిందితుని తరపున ఎస్. కే. ఏ. కృష్ణావతారంగారు వాదించారు. (స్వవి)

# రోజుకు 8 గంటలకు మించి పనిఉండరాదు

## విజయవాడలో రైల్వే ఉద్యోగుల విన్నపము

విజయవాడ, డిశంబరు 27: "కార్మిక సంఘములు రాజకీయ నాయకులపై ఆధారపడకుండా, సంఘబలముతో ముందుకు సాగవలెను" అని నేడు ఎం. ఎస్. ఎం. రైల్వే ఉద్యోగి సంఘపు మూడవ వార్షికోత్సవమును ప్రారంభము చేయుచూ పి. తిమ్మారెడ్డిగారు హితవొసంగిరి. అయ్యదేవర కాళేశ్వరరావుగారు అధ్యక్షత వహించిరి.

సంఘ కార్యదర్శి చిన్నయ్యగారు మాట్లాడుచూ వారమునకు నలుబది, ఏబది గంటలు పనిని చేయించుట జరుగుచున్నదనియు, దినమునకు 8 గంటలకంటె యెక్కువసేపు పని ఉండకుండా రైల్వే శాఖవారు కట్టుదిట్టము చేయవలెననియూ కోరిరి.

తిమ్మారెడ్డిగారు ప్రసంగించు చూ, స్వతంత్ర ప్రభుత్వ వ్యతిరేకులగు కమ్యూనిస్టులతో చేరకుండా, ఈ ఉద్యోగులు వేరే సంఘములో నున్నప్పటికిని, వారి కష్టముల నేమాత్రము తీర్చకుండుట అన్యాయమనిరి. "ప్రజలకు ప్రభుత్వముపై విశ్వాసము నశింపకుండా చేయవలెనంటే శ్రమకు తగ్గ ప్రతి ఫలమును, విశ్రాంతి రక్షణలను ప్రభుత్వమువారు కలుగజేయవలెను" అని హెచ్చరించిరి. (స్వ. వి)

# తెనాలికి మంత్రి రోష్ విక్టోరియాగారి రాక

## బియ్యం మిల్లు యజమానుల వినతిపత్రం

తెనాలి, డిశంబరు 28 నిన్నటిరోజు తెల్లవారుజామున మదరాసు ఆహారశాఖామాత్యులు గౌ॥ శ్రీ రోషు విక్టోరియాగారు తెనాలికివచ్చిరి. రైల్వేస్టేషనులో జిల్లా కలెక్టరు యస్. కనకసుందరం, డిప్యూటీ కలెక్టరు జి. రామమూర్తి పంతులు, తహసిలుదారు జి. వి. చలపతిరావు, కాంగ్రెసు అధ్యక్షులు అలపాటి వెంకటరామయ్య మునిసిపల్ చైర్మన్‌నన్నపనేని వెంకటరావు మొదలగువారు మంత్రిగారికి స్వాగతమొసంగిరి. తెనాలితాలూకా బియ్యంమిల్లు యజమానుల తరపున ఈమని అప్పిరెడ్డి ప్రభృతులు మంత్రిగారికి ఒక విజ్ఞప్తిం సమర్పించూ జనవరినుండి మిల్లులపై సెస్సులు ఒకమిల్లునుంచి మరియొకమిల్లుకు మార్చగలెననియు, ఒక తాలూకానుంచి మరియొక తాలూకాకు ధాన్యం వెళ్లరాదనే ప్రభుత్వ ఆంక్షను తీసివేయవలెననియు, మిల్లులనుండి రిటైలర్లకు సరకునిచ్చి ప్రజలకు చెందునట్లుగ చేయవలెను గాని మధ్య బ్రోకర్లు లాభపడరాదనియూ తెలియజేసిరి. తరువాత మంత్రిగారు యీ తాలూకా సంగంజాగర్లమూడి గ్రామంలో జరిగిన ముపాను వల్ల నష్టపడిపోయిన సంగమేశ్వరస్వామి వారి ఈనాం భూములున్నూ మిగతాతోటలు వగైరా నష్టపడినప్రాంతమంతా చూచి మధ్యాహ్నం గుంటూరువెళ్ళిరి. (స్వ. వి.)

## గణితశాస్త్ర వేత్తల చిత్రపటముల ఆవిష్కరణ

చెన్నపట్నం, డిశంబరు 29 : మదరాసు ప్రెసిడెన్సీ కాలేజిలో వెనక గణిత శాస్త్రపు ప్రొఫెసర్లుగా వుండిన శ్రీ కే ఆనందరావు, డా॥ ఆర్. వైద్యనాథస్వామి, శ్రీ టి సూర్యనారాయణ, శ్రీ పి. వి. శేషుఅయ్యర్ గార్ల ఛాయాచిత్రములను సర్ యస్ వి. రామమూర్తిగారు నిన్న సాయంత్రం కాలేజిహాలులో పలుప్రముఖ అతిథుల సమక్షమున ఆవిష్కరించిరి. అతిథులందరూ అల్పాహార విందారగించిన మీదట ఆనందరావు సంస్మరణ కమిటీ అధ్యక్షుడు డా॥ ఆర్ వైద్యనాథస్వామి గారు స్వాగత మొసగుచూ విద్యార్థులు ఆనందరావు సంస్మారక నిధికి విరాళములు వ్రాసుచేసి సహాయ్యపడిరనియు వారి పేర విద్యార్థి వేతనం నిధి ఏర్పరుచుటకు రూ 8000 కావలసి ఉంగు యిప్పటికి సగమే వసూలైనదనియు మిగతా మొత్తము కూడా త్వరలో ఇవ్వగలరని ఆశిస్తున్నదనియు తెలిపిరి. స్వా॥ వి గోవింద పిళ్లైగారు సురిమున్నగు చాయాచిత్రము లను బహూకరిస్తూ వారు కాలేజికి చేసిన సేవ నగ్గడించిరి.

సర్ రామమూర్తిగారు గణిత శాస్త్రి చార్యుల చిత్రపటములను ఆవిష్కరిస్తూ కాలేజి విద్యార్థులకు వారొసగిన శిక్షణ క్రమశిక్షణము విద్యార్థులకు ఎంతటి ఉన్నతోద్యోగాలకు అర్హులుగా చేసెనని, కేవలము ప్రజలు అట్టి అయ్యోపదార్థములను వాడుక నేవారుగా నాటిమే అయి యుండుట తెగదనియు పరిశోధనాపరులు అయి దేశసంపదను అన్ని విధములలో అభివృద్ధి పరచే వారై యుండవలెననియు సర్ రామమూర్తిగారు విన్నవించిరి

డా॥ వి. కే. అయ్యప్పన్ పిళ్లైగారు చిత్రపటములను కాలేజి తరపున స్వీకరించిరి వందనార్పణముతో సభ ముగిసెను.

## మెడికల్ కాలేజి విద్యార్థినులకు తగ్గింపు జీతాలుగూర్చి ఉత్తరువు

ప్రభుత్వ మెడికల్ కాలేజిలలో ప్రవేశము బడయు విద్యార్థినులకు 1949 అక్టోబరు 18 వ తేదీ ఉత్తరువులో తెలిపిన జీతాల తగ్గింపు సౌకర్యాలు 1950-51 సంవత్సరంనుండి అమలుపరచి రెండేళ్ళ పర్యంతము ఉండునట్లు ప్రభుత్వము యిపుడు ఉత్తరవు చేసియున్నది.

(1) హరిజన్ విద్యార్థినులకు పూర్తి జీతం మినహాయింపు (2) ముస్లిం స్త్రీలకు సగం జీతం మినహాయింపు (3) 6 గురు బీద విద్యార్థినులకు నివ్వదలచి ఉచిత విద్యార్థి వేతనముల సౌకర్యము హరిజన స్త్రీలకు తప్ప మిగతా కులాల వారికి నివ్వబడును

జీతాల మినహాయింపు నొసగుటకు మదరాసు విద్యా విషయక నిబంధనల క్రింద నిర్ణయించి యుండే ఆదాయ పరిమాణము అన్ని కులాల వారికి వర్తించును

### ఆహార ధాన్యాల కంట్రోలు ఉత్తరవు లైసెన్సు పినాల్టి

ఆహార ధాన్యాల కంట్రోలు ఉత్తరవు క్రింద లైసెన్సు పొందు వారు తమ లైసెన్సు రుసుములను చెల్లించుటకు అలక్ష్యము చెస్తే అట్టి అలక్ష్యమును సివిల్ సప్లయిస్ కమిషనరు గాని అందుకు సంబంధించిన మరే ఉద్యోగి గాని ఎంతి కాలమైన క్షమించవచ్చు గాని అట్టి పంద ర్భములలో తప్పక రూ 2 పినాల్టి విధించవలెనని నైనిబంధన సవరింపబడినది.

## ఉద్యోగులకు శిక్ష

తూర్పు గోదావరిజిల్లాలో కొన్ని ఇరిగేషను పనులు సందర్భమున యిరువురు సూపరవైజరులు యం. వంకటరావు, టి. సుబ్బారావుగార్లు లంచాలు పుచ్చుకొన్నారని, స్పెషలు పోలీసు విచారణపై అధికారులు విచారణ జరిపించి, వారియిరువురిని ఉద్యోగంనుండి తొలగించిరి.

### సాందూరుకు స్టాంపుల చట్టం వర్తింపు

1950 జనవరి 1 తేదీనుండి సాందూరు సంస్థానమునకు భారతీయ స్టాంపుల చట్ట ము వర్తింపచేయబడును.

### సూత్రయజ్ఞము

పెరంబూరు, చరిఖామండలి యాజమాన్యమున, 30 తేది శుక్రవారం సాయంకాలం (పచేలమిల్లు 72 నంబరు భవనమున) 3 గంటల నుండి 4 వరకూ. సూత్రయజ్ఞమును, 4 గంటలనుండి, ఫిరాయి సేవల ఎంపెంట శాఖాధికారి శ్రీ జి. వంకటాచలపతిగారి యధ్యక్షతన, బహిరంగ సభయు జరుగును. ఎల్లరు విచ్చేయ ప్రార్థితులు.

# గ్రామసీమల శస్త్రవైద్య సౌకర్యాల ఆవశ్యకత

## భారత శస్త్రవైద్యసంఘ సమావేశం భావనగర్ మహారాజా ఉద్బోధ

మదరాసు, డిశంబరు 29 శస్త్రవైద్యాభివృద్ధి అంతర్జాతీయముగాను పరస్పరభావములు తెలుసుకొనుట, అంతర్జాతీయ ప్రమాణములను ఇండియా అంతట అనుసరించుట, పరిశోధనకు, శిక్షణకు తగినన్ని వైద్యకళాశాలల అవసరము, గ్రామములలో శస్త్రవైద్యమునకు ఏర్పాట్లు చేయుట మున్నగు విషయములే గాక వైద్యవృత్తిలో సాంకేతిక విజ్ఞానాభివృద్ధికి ఈ సంఘకృషి చేయవలసియున్నదని మదరాసు గవర్నరు మాన్యశ్రీ భావనగర్ మహారాజా నేటి ఉదయం మదరాసు మెడికల్ కళాశాల ఆవరణలో భారత శస్త్రవైద్యసంఘ 11 వ వార్షిక సమావేశమును ప్రారంభించుచు నుడివిరి.

దేశోదయంనుండి ఇచట డాక్టర్ పంచాననఘటర్జీ అధ్యక్షతను జరుగుచున్న సమావేశమునకు బొంబాయి, ఢిల్లీ, కలకత్తా, నాగపూర్ మొదలగు నగరముల నుండి సుమారు అయిదువందల ప్రతినిధులు వచ్చిరి.

ఆహ్వానసంఘాధ్యక్షుడు లె. కర్నల్ కె జి. పండాలై స్వాగతమిచ్చిన తరువాత సమావేశమును ప్రారంభించుచూ మదరాసు గవర్నరు భావనగర్ రాజా ఇట్లు చెప్పిరి వ్యక్తి గతముగ వాడు వృత్తితో సంబంధము లేకపోయినను నన్ను ఈ సమావేశమును ప్రారంభించ మనుటవలన మీసంఘమునకు మీవృత్తికి రాజ్యాంగములో గల ప్రాధాన్యమునకు చిహ్నము. వైద్యరంగములో ప్రముఖస్థానము వహించిన రాష్ట్రమునకు గవర్నరుగా మిమ్ములను ఆహ్వానించుటకు ఎంతేయూ సంతోషముగాయున్నది. భారత గవర్నరుజనరలు, సర్వసైన్యాధ్యక్షులేగాక అనేక మంది రాజ్యాంగవేత్తలు, ప్రభుత్వకార్యదర్శులు వైద్యప్రవీణులు ఇక్కడవారే.

మీసంఘము ప్రారంభము అయి 11 సంవత్సరములైనను యుద్ధమువల్ల ఆవాంతరమువచ్చినను భారతదేశములో ప్రముఖ సంస్థగా అభివృద్ధి చెందెను. ఇటువంటి సంస్థయొక్క అవసరముగురించి నేను ప్రత్యేకముగా చెప్ప నవసరములేదు శస్త్రవైద్యమును అంతర్జాతీయ ప్రమాణములతో సరితూగవలసియుండును. గత కొన్ని సంవత్సరములలో శస్త్రవైద్యము చాల అభివృద్ధి అవుతూ వచ్చిను కనివిని ఎరుగని ప్లాస్టిక్ సర్జరీ ఏర్పడెను. ఇదే రీతిగా మెదడు, హృదయ శస్త్రచికిత్సలో కూడ గొప్ప అభివృద్ధి జరిగెను. పరస్పర సహకార సంప్రదింపులు వున్న గాని ఈ శాస్త్రము వృద్ధికాదు. ఈ విషయమై మీ సంఘము కృషి చేయవలసి యుండును. విశ్వవిద్యాలయములు, వైద్యకళాశాలలో ఉన్నత ప్రమాణములు సంప్రదాయములు ఏర్పడినను సమన్వయముగా పని చేయని యెడల ప్రమాణములు మారుచుండును. అందువలననే పాశ్చాత్య దేశములలో డిగ్రీలు, డిప్లమాలు ఇచ్చుటకు వైద్యులు, సర్జనల కాలేజీలు వున్నవి. ఇదికూడ మీ ఉద్దేశ్యములలో ఒకటి అయి వుండవచ్చును. మీ ప్రయత్నము ఫలించవలెనని ఆశించుచున్నాను.

మీ సంఘము కేవలము సాంకేతిక విషయములకు సంబంధించినా మరో విషయము దేశములో ప్రజారోగ్య స్థితిని తెలుసుకొనవలసి యున్నది. గ్రామములలో వైద్యులు, శస్త్రవైద్యుల లోటు బాగుగా వున్నది. ఈ లోటును భర్తీ చేయు విషయము పరిశీలించ వలసియున్నదనిరి.

### అధ్యక్షోపన్యాసము

ఈ సంవత్సర సమావేశమునకు అధ్యక్షుడుగా ఎన్నుకొని నందుకు కృతజ్ఞత తెలుపుచూ డాక్టర్ పంచానన ఘటర్జీ అధ్యక్షోపన్యాసములో ఇట్లు చెప్పిరి ఇటువంటి సమావేశములు మన శాస్త్ర విజ్ఞానాభివృద్ధికి తోడ్పడును. అయితే మన వృత్తికి, దేశమున చేయవలసిన పని ఎంతో యున్నది. కనుక భారతదేశములో శస్త్రవైద్య అభివృద్ధి గురించి మాట్లాడదలచితిని నాకు పూర్వులు దేశములో శాస్త్రవైద్య ఉన్నత ప్రమాణము గురించి అభిప్రాయములు తెలిపిరి. మార్గములు సూచించిరి, ఆ మార్గముల నేగాక మన ఉద్దేశ్య నిర్వహణకు కొన్ని ఆచరణ యోగ్యమైన మార్గములను సూచించదలచితిని. ప్రస్తుతము దేశమును ఆవరించిన పరిస్థితిలో ఆలిండియా మెడికల్ ఇన్‌స్టిట్యూట్ ను, శస్త్రవైద్య నిలయములను స్థాపించ నవేశించుటకు వీలు లేదు వాస్తవ పరిస్థితులకు అనుగుణ్యముగా మనము అభివృద్ధికి ప్రయత్నించవలసి యున్నది. భారతదేశము అంతర్జాతీయ తీరులో స్థానము పొందుటకు జాతీయ కార్యక్రమములో ప్రజారోగ్యమునకు ప్రముఖస్థానము నుంచవలెను. దేశ జనసంపదను సక్రమముగా వినియోగించుకొనుటకు వ్యక్తి ఆరోగ్యము చాల ప్రధాన విషయము, భోర్ కమిటీ సమగ్ర పరిశీలనానంతరము ఆచరణయోగ్యమైన శిఫార్సులు అనేకము చేసెను ప్రజలు వానిని అమలు జరుపవలెనని కోరుచున్నారు. కాని శిఫార్సులను అమలుజరిపే ఉత్సాహమే కనిపించుటలేదు. పాశ్చాత్య వైద్యము ఎంతెంతో అభివృద్ధి అయినది కాని ఆ అభివృద్ధిని మనము వినియోగించుకొనక పోవుచుంటిమి ఉన్న కొద్ది పెద్ద నగరములలోనె వున్నది గ్రామములకు ఉపయోగించుటలేదు. గ్రామములలో ని ఆరోగ్య కేంద్రములు శస్త్రవైద్యమునకు తగినవిగా లేవు. వైద్యమును జాతీయ మొనర్చినగాని అందరికి సమాన వైద్య సౌకర్యములు ఏర్పడవనే విషయము అందరూ అంగీకరించినదే, ఇండియాలో వైద్యమును జాతీయమొనర్చుటలో గల కష్టములువిదితమే, ఉచితవైద్య సౌకర్యములు గల రష్యాలోకూడ ఇన్సూరెన్సు, నిధుల నుండి ఖర్చు భరించెదరు, అయితే ఈ ఇన్సూరెన్సు నిధికి వ్యక్తులుగాక వ్యక్తి పని చేయు సంస్థ చెల్లించుకొనును, బ్రిటనులో 1948 లో జాతీయ ఆరోగ్య ప్రచారము ప్రారంభమైనది. ఈ విధముని ఉద్దేశించినను ఉచితముగా ఏమీ లేదు. ఖర్చును దేశము మొత్తముమీద పన్నువేసి తద్వారా వసూలుచేయుదురు. మనదేశములో జాతీయమొనర్చుటకు వీలులేకపోయినా గ్రామములలో శిక్షణపొందిన వైద్యులతో చిన్న అస్పత్రులు ఏర్పరచవలెను. ప్రస్తుతము సబ్ డివిజనల్ పట్టణములలో ఆధునిక సౌకర్యములుగల ఆస్పత్రులతో తృప్తిపడవలసియుండును. ఈ ఆస్పత్రులలో పని చేయుటకు సుశిక్షితులైన వైద్యులు అవసరం. వీరి శిక్షణనిమిత్తము సంఘటిత కార్యక్రమము అవసరము.

పారిశ్రామిక కేంద్రములలో కార్మికులకు సక్రమ, సకాల వైద్యప్రయోజనము కలుగుటకు పారిశ్రామిక ఆరోగ్య సర్వీసును నెలకొల్పవలసి యున్నది. ఆలిండియా మెడికల్ ఇన్‌స్టిట్యూట్ ను ఏర్పరచవలెనను భోర్ కమిటీ సూచనను అమలు జరుపకపోవుట వైద్యవృత్తికి నిరుత్సాహము కలిగించినది. ఈ వృత్తి అభివృద్ధి కావలెనన్న మన విధానము దృక్పథము పూర్తిగా మారవలెననిరి.

డాక్టర్ ఘటర్జీ ఇండియాలో వృత్తి అభివృద్ధికి, వైద్య శిక్షణనుగురించి అనేక సూచనలు చేయుచూ ఇంకనూ ఇట్లనిరి. దేశములోని లక్షలాది జనము శస్త్రవైద్య ప్రయోజనము పొందుటకు చేయవలసిన సూచనలను అమలు జరుపుటకు చాల వ్యయము అవగలదు వ్యక్తి ఆరోగ్యము మీదనె దేశసంపద ఆధారపడియున్నది. ఇంతకంటె అత్యవసరముగా చేయవలసిన పని మరొకటి వుండబోదు, వ్యక్తిగత ఆదాయము వృద్ధిఅయినగాని వైద్యవృత్తిని జాతీయమొనర్చుటకు వీలులేదు. దేశములోని ఆర్థిక పరిస్థితులనుబట్టి ప్రస్తుతము ప్రజలలో ప్రచారముచేసి ఆస్పత్రుల నిమిత్తము దానధర్మములు సేకరించవలసియున్నది, విదేశాలలో ప్రయివేటుసంస్థలు అమూల్యమైన సేవచేయుచున్నవి. ఇండియాలో అటువంటిది తక్కువ. తగిన నాయకులు ముందుకువచ్చిన ఇది సాధ్యమవుతుందనిరి.

## ప్రభుత్వ ఋణాల వడ్డీ రేటు
### బొంబై ఆర్థిక వర్గాల అభిప్రాయాలు

బొంబాయి, డిశంబరు 27 : ప్రస్తుతం చౌక రేట్ల మీద ప్రభుత్వం డబ్బు అప్పు తీసుకునే పద్ధతి మార్చుకోవాలని సర్ చమన్‌లాల్ చేసిన విజ్ఞప్తిని గూర్చి బొంబాయిలో వాదోపవాదాలు జరుగుతున్నాయి.

మొత్తంమీద అందరూకూడా ఆయన ఆర్థికపరిశీలనను మెచ్చుకుంటున్నారు 1946 నుంచి ఏర్పడిన ఆర్థికస్థితిని, అనంతరం తరిగిపోవడం ప్రారంభించిన రూపాయివిల్వలను, అందుకు ఆయనసూచించిన మార్గాన్ని వారు వార్గిస్తున్నారు.

ప్రభుత్వం నగదుమార్కెట్టులో అప్పు లు లేదీయుకోవడానికి అయినఖర్చు నంతా ప్రభుత్వంనెత్తిమీద గద్దాకు కాని ఇతరంగా ధనికులను ఆలోచిస్తే, అది సరియైనవాదంకాదని, ప్రస్తుతంవున్న పన్నులభారంగల్లనే ప్రభుత్వానికి ఈ అప్పులు ఏర్పడుతున్నాయని వారు అంటున్నారు.

కొత్తగా మళ్ళీ పన్నులు విధించే బదులు టపవాలకు వడ్డీరేటును గూరిస్తే సాధ్యమౌతుందా అంటే, అది తనకు తగినమార్గంగా కనపడుటంలేదని జాన్ మత్తయ్ ఖచ్చితంగా చెప్పేవున్నారు. డా॥ వి. కె ఆర్. వి. రావుగారు ఇంకోమార్గాన్ని సూచించారు. ఇన్నఎక్కువ దాచుకొనే ధనానికి కొంచెం హెచ్చువడ్డీ ఇస్తేగా కొట్టాలనుకోవడం పెద్ద మొత్తాలను తీసుకోవడం సాధ్యం కాకపోవచ్చునని ఆయన అన్నారు. వడ్డీ హెచ్చినంతమాత్రంచేత డబ్బువచ్చి మన చేతుల్లో పడదు. ఎందుచేతనంటే వడ్డీవల్ల వచ్చే ఆదాయం నికరమైన ఆదాయం కావడంలేదు ప్రభుత్వం పన్నుల మేరతో ఈ ఆదాయాన్నంతా తిరిగిగ్రహిస్తున్నది అందువల్ల వడ్డీరేటును పెంచడంకంటె, పన్నుల భారాన్ని తగ్గిస్తే ఎంతో బాగా పనిచేస్తుంది, అని ఆయన తన మార్గాన్ని వివరించారు.

ఇప్పుడు ఉన్నట్టుండి ఒక్క దెబ్బతో చౌకరేటు అప్పు పద్ధతిని తోసివేస్తే, మార్కెట్టు దెబ్బతింటుందని చమన్‌లాల్ భావిస్తున్నారు. అదీ కాకుండా ఇప్పుడు వడ్డీరేటు కొంచెం పెంచితే, ఇకముందు దాన్ని పెంచేందుకు తగిన విధముగా పెట్టుబడిదార్లు ప్రవర్తించ గలరని మరికొందరు హెచ్చరిస్తున్నారు. అందువల్లగూడా మార్కెట్టు గట్టిదెబ్బ తింటుంది.

## ప్రభుత్వ వాణిజ్యం: బొంబాయిలో చర్చలు

బొంబాయి, డిసెంబరు 28 : ఇండియా ప్రభుత్వం విదేశీవాణిజ్యంలో పాల్గొనడం వాంఛనీయమా, కాదా అన్న విషయమై నేడు ప్రభుత్వ వాణిజ్యసంఘంవారు బొంబాయి వణిజులతో మరికొంత చర్చసాగించారు. ఈ సంఘంవారు గత ఆదివారము ఇక్కడికి వచ్చారు. వీరు రేపటితో ఇక్కడ చర్చలు ముగించి అనంతరం మద్రాసు వెళ్ళి అక్కడ నాలుగురోజులుండి అక్కడి నుండి నేరుగా ఢిల్లీలోని తమ కేంద్రానికి వెళ్ళి ఫిబ్రవరి మొదటివారంలోగా ప్రభుత్వానికి తమ నివేదిక సమర్పిస్తారు. వీరు ఇదివరకే కలకత్తా వెళ్ళి అక్కడి వణిజులతో సంప్రతింపులు జరిపి ఉన్నారు.

## డా॥ మాలన్ ఉత్తరాధికారి ఎవరు?

లండన్, డిశంబరు 28 : అనారోగ్య కారణంవల్ల డా॥ డేనియల్ మాలన్ దక్షిణ ఆఫ్రికా ప్రధాని పదవిని చాలించుకోవాలని చూస్తున్నాడు. కాని ప్రస్తుత పరిస్థితిలో ఈ మార్పు పార్టీకి వినాశకరం కాగలదని ఆయన అనుయాయులు భయపడుతున్నారు. డా॥ మాలన్‌కూడా ఈ సంగతి గ్రహించకపోలేదు. మాలన్ ప్రధాని పదవిని చాలించుకోవడం అని వార్తం అయేట్లయితే, ఆయనకు ఉత్తరాధికారి కాగలవారు ఎవరు అన్నప్రశ్న పుడుతుంది. ఈ పదవికి ఈ క్రిందివారిలో ఎవరోఒకరు ఉత్తరాధికారి కావచ్చునని ఊహాగానం జరుగుతున్నది: ఎల్. సి. హవెంగా (ఆర్థిక మంత్రి) స్వదేశాంగమంత్రి డా॥ డోంగ్సు ఆదిమ జాతులమంత్రి డా॥ జాన్సెన్; భూమి అమరకపుశాఖ మంత్రి జే. జి. స్ట్రిజెమ్. గ్లోబ్.

## చైనా-వియత్నాం

పారిస్, డిసెంబర్ 28 చైనా కమ్యూనిస్టులు ఇండో-చైనాపైన దాడి చేస్తే ఫ్రాన్సు రక్షణం ఐక్యరాజ్య సమితికిఫిర్యాదు చేసి, దేశాన్ని రక్షిస్తుందని, అక్కడ ఫ్రెంచి హైకమిషనర్‌గా ఉన్న పిగ్నాన్ నేడిక్కడ 'ఫ్రాంస్ స్వార్' పత్రికలో ఒక వ్యాసం వ్రాస్తూ హెచ్చరించాడు.

## క్వారీ పనివారి సమ్మె ముగియుట

కార్పొరేషను పల్లవరం క్వారీయందు 750 పనివారు పనిచేయుచున్నారు. రోడ్డు పనులు తగ్గిపోయినందున సుమారు 350 మందిని తీసి వేయవలసి వచ్చెను. పనివారందరూ 26 ఉదయం సమ్మెచేసిరి. అందుచే వారానికి ఆరురోజులు పని బదులు, నాల్గురోజులు మాత్రం పని జరిపించి అందరిని ఉంచుటకు నిశ్చయించబడెను. మరునాడందరు పనిలోచేరిరి.

### ప్లీడర్లు అడ్వకేట్లుగా దాఖలగుట

చెన్నపట్నం, డిశంబరు 28 : మదరాసు హైకోర్టుకు సెలవులైయున్నప్పటికి ప్రధాన న్యా॥ పి వి. రాజమన్నార్, న్యా॥ సుబ్బారావు, యస్. కృష్ణస్వామి నాయుడుగార్లు యీవాళ ప్రత్యేకముగా కోర్టుజరిపి 161 మంది ప్లీడర్లను అడ్వకేటుగా దాఖలుచేసుకొనిరి.

## డాలర్ ప్రాంతాలలో జపాన్ పెట్రోలు కొనుగోలు
### స్టర్లింగ్ ఉపయోగించరాదని బ్రిటిష్ నిర్ణయం

న్యూయార్కు, డిసెంబరు 28 : జపాను తన స్టెర్లింగునిల్వలతో డాలరు ప్రాంతంనుండి చమురు కొనరాదని బ్రిటిషుప్రభుత్వం మిత్రరాజ్య సర్వసేనానికి నివేదించినట్లుగా ఈ వేళ తెలియవచ్చింది. ఈమాట నిజమే అయితే అమెరికన్ చమురు కంపెనీలు స్టెర్లింగు ప్రాంతాలలోనేగాక, జపానులోకూడా పని కట్టిపేసుకోవలసి వస్తుంది. డాలర్లు ఆదా చేసుకోడానికి బ్రిటన్ ఇలా వుండవచ్చునని, ఇందులో ఆశ్చర్యపడవలసిందేమీ లేదని విషయజ్ఞులు వ్యాఖ్యానిస్తున్నారు. కాని అమెరికా చమురు కంపెనీలకు దీనివల్ల బాగా దెబ్బ తగులుతుంది.

### అమెరికాలో ఈ ఏడాదికి 2500 విమానాల నిర్మాణం

వాషింగ్టన్, డిసెంబరు 28 :—ఈ సం 1949 సంవత్సరం మొత్తం మీద 2500 యుద్ధ విమానాలు నిర్మించినట్లు విమాన పరిశ్రమ సంఘం వారి అంచనా వల్ల తెలుస్తున్నది

## హైద్రాబాద్‌లోని విమానాశ్రయాలు

### త్వరలో భారత ప్రభుత్వ వశం

బొంబాయి, డిసెంబరు 29: హైదరాబాదు సంస్థానంలోని హాకింపేట, బీగంపేట, ఔరంగాబాదు విమానాశ్రయాలు భారత ప్రభుత్వం త్వరలో వశపరచుకొంటుందని ఇక్కడ తెలిసినది.

ఈ విమానాశ్రయాలకు ఆధునిక యంత్ర పరికరాలు, రేడియో వార్తా సౌకర్యము, అన్ని ఉన్నాయి. హాకింపేట, బీగంపేట ఈ ప్రాంతంలో విలీనం చేయబడతాయి. ఔరంగాబాదు బొంబాయి ప్రాంతంలోనికి పడుతుంది.

భారతప్రభుత్వానికి చెందిన విమాన ప్రయాణశాఖ ప్రధాన ఇంజనీర్ ఎస్. ఎస్. మధుర్ అను వారు జనవరి 8 న హైదరాబాదుకు వెళ్లి ఈ విమానాశ్రయములను స్వాధీనం చేసుకునే విషయమై సంప్రదింపులు జరుపుతారు.

# భారత ఆర్థిక వ్యవస్థలో హైద్రాబాద్ విలీనం

## ఏప్రిల్ 1 నుంచి కొత్తవిధానం అమలు: కృష్ణమాచారి కమిటీ సిఫార్సులకు ఉభయ ప్రభుత్వాల అంగీకారం

న్యూఢిల్లీ, డిసెంబరు 29: హైదరాబాదు సంస్థానంలోని ఫెడరల్ ఆర్థిక, ఖజానా వ్యవస్థను భారతయూనియన్‌లో మిళితం చేయుటకై కృష్ణమాచారి కమిటీవారు చేసిన సిఫార్సుల నివేదికను భారత, హైదరాబాదు ప్రభుత్వాలు రెండూ కొలదిమార్పులతో అంగీకరించినవి.

ఈ విలీనవిధానము సంస్థానమునకు, కేంద్రమునకు రాజ్యాంగ సంబంధాలు ఆఖరుసారిగా నిర్ణయింపబడిన అనంతరం తిరిగి ధ్రువపరుపబడవలసి యున్నది.

ప్రస్తుత నివేదిక ప్రకారం రాబోవు ఏప్రిల్ 1 వ తేదీనుండి భారత ప్రభుత్వము సంస్థాన కరెన్సీ పరిపాలన యావత్తునూ స్వాధీనం చేసుకుంటుంది.

సంస్థానంలోని కస్టమ్సు నిబంధనలను మూడేళ్ళలో క్రమశః రద్దు చేసి వేయవలెనని కమిటీ నివేదిక సూచించినది కాని ఈ కాలపరిమితిని నాలుగేళ్లుగా మార్చవలెనని ఉభయ ప్రభుత్వములు తీర్మానించుకొన్నవి.

హైదరాబాదు కరెన్సీని, నాణెములను రద్దు చేయవలెనా, అయితే ఎప్పటినుండి, ఏవిధంగాను అనే ప్రశ్నలను తేల్చి నిర్ణయించవలసినది కేంద్రప్రభుత్వమే. రద్దు చేసే పక్షంలో, ఈ స్థానిక యాకరెన్సీని భారతీయ కరెన్సీలోనికి అధికార మారకపురేటు ప్రకారం మార్చుకొనుటకు ప్రజలకు వీలైనంత ఎక్కువ గడువును ఇవ్వవలెనని కమిటీనివేదిక సిఫార్సు చేసినది. (భారతీయ రూపాయలు ఆరు ఉస్మానియా సిక్కా రూపాయలు ఏడింటికి సమానము.)

ఈ మారకపు రేటు, అలాగే ఉంచబడుతుందని, ఎంతవరకునైనా ఈ రేటు ప్రకారం మార్చుకొనటానికి సదుపాయాలు కలుగ జేయబడతాయని ప్రజలకు హామీ యివ్వాలని కూడా సిఫార్సు చేయబడింది.

సంస్థానంలోని కస్టమ్సు నిబంధనలు రద్దుకావటంవల్ల కలిగే ఆదాయ నష్టమును భర్తీ చేసుకొనటానికి సంస్థానం ఇతర మార్గాలను అన్వేషించవలసి ఉంటుంది కస్టమ్సు ఆదాయమును తొలగించి క్రమంగా అమ్మకం పన్నువల్ల ఆదాయం సంపాదించుకొనటానికి మధ్య సంధి కాలంగా పదేళ్లు గడువివ్వాలని కమిటీ సూచించింది.

ఫెడరల్ ఆదాయమును కేంద్ర ప్రభుత్వం స్వాధీనపరచుకోవటం వల్లను, కస్టమ్సు రద్దుచేయబడటంవల్లను, సంస్థానానికి మొత్తంమీద 5,86,00,000 (ఉస్మానియా రూ॥) ల నష్టం వస్తుంది ఇందులో ఫెడరల్ ఆదాయ నష్టంవల్ల 2,21,00,000 ఉ. రూ. లు, కస్టమ్సు రద్దువల్ల 3,65,00,000 ఉ. రూ. లు, నష్టము వస్తుంది. ఫెడరల్ ఆదాయ నష్టమును కేంద్రప్రభుత్వము పదేళ్లవరకూ భర్తీచేసి సంస్థానమునకు ఇస్తూ ఉండాలి. ఈధనమును కేంద్ర ఆదాయపు పన్ను లోనుండి తీసి హైదరాబాదు వాటాకు హైదరాబాదుకివ్వాలి. ఈ వాటాధనం భర్తీచేయటానికి సరిపోకపోతే ఇతర కేంద్ర ప్రభుత్వపన్నుల ఆదాయంలోనుండి పైవిధంగా తీసి పద్దాలి. వచ్చే ఆర్థిక సంవత్సరంనుండి హైదరాబాదునకు కూడా ఇతర రాష్ట్రాలకువలెనే ఆహార సబ్సిడీలను ఇవ్వాలి. అయితే ఈ సబ్సిడీలను, ఇంకా కేంద్ర ప్రభుత్వం ఇవ్వబోయే గ్రాంటులు, బోనసులు, ఇతర ధన సహాయం, టెక్నికల్ సహాయం మొదలైనవన్నీ కేంద్రం ప్రత్యేకంగానే ఇస్తుంది. వీటికీ సంస్థాన ఫెడరల్ ఆదాయ విలీనమునకూ సంబంధంలేదు.

నిజామునకు ధరణమిచ్చే బాధ్యతను కేంద్రప్రభుత్వం వహిస్తుంది, దానిని ఫెడరల్ వ్యయంగానే పరిగణిస్తుంది.

సంస్థాన ఖజానాలోని లోటును భర్తీ చేయుటానికి కేంద్రప్రభుత్వం ఇచ్చే హామీ పదేళ్ల తరవాత రద్దవుతుంది. విలీనం జరిగిన తరవాత ఆస్తులను, అప్పులను కేంద్ర ప్రభుత్వం, సంస్థాన ప్రభుత్వం పంచుకుంటాయి.

భారత సంస్థానాల ఖజానా దర్యాప్తు సంఘంవారు హైదరాబాదు విషయమై నివేదించిన సిఫార్సులు ఆ సంస్థానము యొక్క రాజ్యాంగ భవిష్యత్తు ఇంకా తేలనందున ఇప్పటిదాకా నిలిపి వేయబడి, ఇప్పుడు ప్రకటనకు జారీ చేయబడినవి. ఈ సంఘంలో వి. టి. కృష్ణమాచారి, ఎస్. కె. పటేల్, ఎన్. దండేకర్ సభ్యులు.

వీరు చేసిన సిఫార్సులు ఇతర సంస్థాన సమాఖ్యల విషయంలోనూ, మైసూరు విషయంలోనూ చేసిన సిఫార్సుల మాదిరిగానే ఉన్నవి, అనగా మార్చి రాజ్యాంగము అమలులోకి రాగానే రాష్ట్రాలూ, సంస్థానాలు కేంద్రంతో సమానమైన ఆర్థిక సంబంధాలు కలిగివుంటాయి సంస్థానముల నుంచి కేంద్రమునకు వర్తించే ఫెడరల్ ఆర్థికాధికారాలు ఆదాయపుపన్ను, కేంద్ర ఎక్సైజు, రైల్వేలు, తంతి తపాలా, టెలిఫోనులు, కరెన్సీ, నాణెములు, రక్షణశాఖ, పురావస్తు పరిశోధన, భూగర్భ పరిశోధన, ఇన్సూరెన్సు, ఆడిట్ అకౌంట్లు వ్యవహారములు.

## "దేశప్రయోజనాలకు రాష్ట్ర ప్రయోజనా లడ్డుకారాదు"

### పురుషోత్తమదాస్ టాండన్ ఉద్బోధ

హైద్రాబాద్, డిసెంబరు 29: "భారతదేశం పురోభివృద్ధి నొంది పకశైశ్వరములతో తులతూగవలెనంటే కూడిన గా సంపాదించుకొన్న స్వాతంత్ర్యమును స్థిరీకరింపజేసి ఐకమత్యంతో కృషి చేయుట అవసరం. హైదరాబాద్ సంస్థానాన్ని భాషాభాగాలుగా విభజించే విషయం భారతప్రభుత్వ ఆలోచనలో సన్నిదనటలో సందేహమేమీలేదు. కాని ప్రతి విషయాన్ని జాగ్రత్తగా సంఘటితపరచటం దృష్ట్యానే చూడాలి. నేను యిది అత్యంత ఆవశ్యకమైనది" అని యు. పి. రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు బాబుపురుషోత్తమదాస్ టాండన్ నేడు హైదరాబాద్ సంస్థాన కాంగ్రెస్ నేతల సభలో ప్రసంగిస్తూ ఉద్బోధించారు. ఈ సభకు స్వామి రామానందతీర్థ గారు అధ్యక్షత వహించారు.

"ప్రస్తుతం దేశంలో ఏమార్పు యెదలచుకొన్నప్పటికీ అది బహు ప్రయోజనాలు కలిగినదిగా ఉండవలెను. రాష్ట్ర పరిహద్దు మార్పు చెయ్యటంవల్ల జాతి ప్రయోజనాలకు భంగం కలగని పక్షంలో దానికి ఎవ్వరూ అభ్యంతరం చెప్ప ఇటీవలన స్వాతంత్ర్యం పొందిన భారత దేశం సర్వసంపదలతో తులతూగుతుంటే సంపూర్ణ ప్రజాస్వామిక దేశంగా వృద్ధి పొందుటకు ప్రజాసేవకులందరు సేవనే ఆదర్శంగా పెట్టుకొనవలెను. స్వార్థాన్ని త్యజించవలెను. దేశ ప్రయోజనాలకు, ప్రాంతీయ లేక రాష్ట్రీయ ప్రయోజనాలు అడ్డుగా నుండరాదు.

దేశంలో ఎక్కడైనా కొంచెం తప్పు జరిగితే కాంగ్రెస్‌ను దుయ్యబట్టటం ఒక ఫాషన్‌గా తయారయినది. కేంద్రంలో కాంగ్రెసు అధికారం వహించియున్న మాట వాస్తవమే. కాని ప్రభుత్వంలో యితర పక్షాలకు చెందినవారుకూడ ఉన్నారు. కేంద్రంవల్ల గాని రాష్ట్రాలవల్లగాని తప్పులేమైనా జరిగితే వాటిని సరిదిద్దుకోవచ్చును. కాని దేశంలోని అనర్థాలన్నిటికీ కాంగ్రెస్‌గాని కాంగ్రెస్ వాదులుగాని మాత్రమే బాధ్యులని చెప్పటకు వీలులేదు.

ప్రజలు తమ బాధ్యతలను విస్మరించి ప్రతిపనిని ప్రభుత్వమే చెయ్యాలనే భావంతో ఉంటున్నారు ప్రజలుకూడా ప్రభుత్వ కష్టములను గ్రహించవలెను.

ప్రభుత్వ ధికారం స్వీకరించిన ఏ ... పక్షంకూడా ఒక్క రోజులో పరిస్థితులను మార్చు చెయ్యలేదు. దీనికి కొంతకాలం పట్టగలదు. ప్రజలు ఓర్పు వహించి ఉండటం అవసరం. ఆంధ్ర (బి) రాష్ట్రకాంగ్రెస్ అధ్యక్షులు పండిట్ నరేంద్రజీ వందనములతో సభ ముగిసింది.

## మద్యనిషేధ ప్రచార అధికారుల నిర్ణయసంఘం

ఏలూరు, డిసెంబరు 27: మద్యపాన నిషేధ ప్రచార అధికారుల నిర్ణయసంఘం (తెలుగు జిల్లాలకు) జనవరి 7 వ తేదీన బెజవాడలో సమావేశమై సంటూరు, కృష్ణా, పశ్చిమగోదావరి జిల్లాలనుండి దరఖాస్తులు పెట్టుకొన్నవారికి ఇంటర్వ్యూ లిచ్చునని పై సంఘాధ్యక్షుడు వాయి. వి. రంగయ్యగారు తెలుపుచున్నారు.

## హైద్రాబాద్‌లో కమ్యూనిస్టు ముప్పు

### అణచుటకు అధికార్ల కృషి

సికంద్రాబాద్, డిసెంబరు 29: హైద్రాబాద్ సంస్థానంలో కమ్యూనిస్టు ఉపద్రవాన్ని సమూలంగా నిర్మూలించుటకు గాను తీసుకోవలసిన చర్యలను గురించి చర్చించుటకు నిన్న నగరంలో ప్రభుత్వాధికారుల సమావేశం ఒకటి జరిగింది. ఆంధ్రదేశంనుండి కృష్ణాజిల్లా సంస్థానంలోకి కమ్యూనిస్టులు రావటాన్ని అరికట్టే విషయమై కొంతచర్చ జరిగినట్లు తెలుస్తున్నది

## కమ్యూనిస్టు ముద్దాయిల అప్పీళ్లు

సికంద్రాబాద్, డిసెంబరు 29: ప్రత్యేక న్యాయవిచారణ సంఘం (ఎ) చే శిక్షలు విధించబడిన కమ్యూనిస్టులు హైకోర్టుకు అప్పీలు చేసుకొన్నారు. ఇవి నిన్న న్యాయమూర్తి శ్రీపతిరావు, న్యాయమూర్తి సియాదత్ అలీఖాన్ గార్లతో కూడిన న్యాయస్థానం ఎదుటకు విచారణకు వచ్చినవి.

న్యాయస్థానంవారు ముందు రెండు కేసులను విచారణకు తీసుకొన్నారు మొదటిదానిలో యిద్దరు కమ్యూనిస్టులు తమకు విధించబడిన శిక్షలపై అప్పీలుచేసుకొన్నారు. రెండవదానిలో 7 గురు కమ్యూనిస్టులు అప్పీలుచేసుకొన్నారు. మొదటిదానిలో అప్పీలు చేసుకొన్న మురహరిరావు. నరసారెడ్డిలకు హత్యానేరంమీద ఉరిశిక్ష విధించబడింది.

ప్రాసిక్యూషన్ వారికథనం ప్రకారం, నిందితులు మురహరిరావు నాయకత్వాన నల్గొండజిల్లా ... గ్రామంలో తాయి రజాకార్లని అనుమానించిన యిద్దరు ముస్లింలను పట్టుకొని రెండుగోజులు అక్రమంగా బంధించిఉంచి తర్వాత గ్రామపొలిమేరల్లో హత్యచేశారు

మొదటికేసులోని ముద్దాయి అయిన మురహరిరావు తాను కమ్యూనిస్టుననీ, తన పార్టీలక్ష్యం నిజాంనవాబు ప్రభుత్వాన్ని కూలద్రోయటమేననీ చెప్పాడు. తమ పార్టీ నిజాం ప్రభుత్వానికి రుద్ధంగా కర్రలు, గుపాకులు మొదలైన ఆయుధాలతో పోరాడుతున్నదనీ, తమలక్ష్యం సాధించువరకు అది అవిశ్రాంతంగా పోరాడగలదనీకూడ మురహరిరావు అన్నాడు

రెండవకేసులో 7 గురు కమ్యూనిస్టులకు ప్రత్యేక న్యాయ విచారణసంఘం(ఎ) చే ఉరిశిక్ష విధించబడింది. ప్రాసిక్యూషన్ కథనంప్రకారం ముద్దాయిలు 1948 సెప్టెంబరు 14 న నల్గొండజిల్లా ... యంపురం గ్రామంలో యిద్దరు కమ్యూనిస్టు వ్యతిరేకులను హత్యచేశారు. ఇంతేగాక వీరు ఆ గ్రామంలో కొన్ని ముస్లిం గృహములనుకూడ దహనపరిచారు.

ఈ రెండుకేసుల విచారణ 1950 జన 8 10 నాటికి వాయిదా వెయ్యబడింది.

## హైద్రాబాద్ తంతి తపాలాశాఖ

### నాగపూర్ సర్కిల్లో కలిపి వేసినందుకు నిరసన

విజయవాడ, డిసెంబరు 28: "హైదరాబాదు, తంతి" తపాలాశాఖను భారత యూనియన్ వ్యవస్థలో కలిపి వేయుట ఆనందదాయకముగనే యున్నది. కాని హైదరాబాదు శాఖను, నాగపూరు కేంద్రముక్రింద నుంచుటకు ప్రభుత్వము నిశ్చయించుట యుక్తముగాలేదు. హైదరాబాదు భవిష్యత్తు తేలక మునుపే, మదరాసు సర్కిల్‌నుంచి తంతి, తపాలా సర్వీసులను, నాగపూరు సర్కిల్‌లో కలిపి వేయవలయునట కూడదు. సంస్థానములో చాలాభాగము తెలుగు ప్రాంతము. ఆంధ్ర తంతి, తపాలా కేంద్రము ఏర్పడువరకును హైదరాబాదును, మద్రాసు సర్కిల్ క్రిందనే యుంచవలెను." అని 25-12-49 నాడు టి. భాస్కరరావుగారి అధ్యక్షతక్రింద సమావేశమై విజయవాడ తంతి, తపాలా పనివారలు తీర్మానించిరి.

స్వ. వి.

## కమ్యూనిస్టుల అరెస్టు

గుంటూరు, డిసెంబరు 28: నర్సరావుపేటలోని ప్రముఖ కమ్యూనిస్టులు కొంతమంది జిల్లాలోని ఒక గ్రామంనుండి వేరొక గ్రామానికి మకాం మారుస్తున్నారని గుంటూరు స్పెషల్ బ్రాంచి పోలీసులు పంపిన వార్తననుసరించి నర్సారావుపేట, చిలకలూరిపేట స్పెషల్ బ్రాంచి పోలీసులు మాగెళ్ళ లక్ష్మీనారాయణ, మేకపోతుల పాపయ్య అనుయిద్దరు ప్రముఖ కమ్యూనిస్టులను అరెస్టుచేశారని తెలియ వచ్చింది. వీరివద్ద కమ్యూనిస్టు సాహిత్యం బాగా దొరికినట్లుకూడ తెలుస్తున్నది.

## గూడవల్లి కమ్యూనిస్టుకు 8 మాసముల కఠినశిక్ష

తెనాలి, డిసెంబరు 28: రేపల్లె తాలూకా గూడవల్లి, వాస్తవ్యుడు, ఘంటా సీతారామయ్య అను కమ్యూనిస్టుపై చెరుకుపల్లి పోలీసువారు క్రిమినల్ లా ఎమెండుమెంటు యాక్టు ప్రకారమున్నూ ప్రజారక్షణ చట్టం ప్రకారమున్నూ తెనాలి ఎడిషనల్ ఫస్టుక్లాసు మేజిస్ట్రేటు కోర్టులో రెండుకేసులు దాఖలుచేసిరి. మేజిస్ట్రేటు గారు విచారించి ముద్దాయికి మొదటి దానికి 6 మాసములు రెండవదానికి 2మాసములు కఠినశిక్ష విధించిరి. (స్వ. వి.)

## మంతెనలో వరికుప్పల దహనం

విజయవాడ, డిసెంబరు 28: నిన్న రాత్రి గన్నవరం తాలూకాలోని మంతెన గ్రామములో 10 ఎకరముల కుప్పలు తగుల బెట్టబడినట్లు తెలియుచున్నది. (స్వ. వి.)

## మదరాసు ధరలు

మదరాసు, డిసెంబరు 30:

బంగారు – వెండి సెటిల్ మధ్యాహ్నం 1 గంటకు పనసు 1-కి ఎస్విల్లా జామెక్స్ సేల్సుటాక్సుతో సహా రు. 76-8-0 పెట్లా బంగారు తులం 114-8-0 మాసబంగారు 113-0-0 సీమవెండి తులం 100 కి (రెడీ) 172-8-0 వెండి తులం 1-కి 1-12-0.

వేరుసెనగ: (581 కా 1-కి ఎక్స్ గోదాగిడ్డంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారుతోపాటి రు. 164, 164-8-0 (కోరమాండల్)

... ఎక్స్ విల్లర్ (ఏజన్సీ) రు. 330 332 బిలో 3% యఫ్. యఫ్. ఎ. సం ... (87 ...) ఒకటికి కొచ్చిన్ క్యాలాన్ ... రు 39-12-9.

## న్యూయార్కు దూది

న్యూయార్కు, డిసెంబరు 29:

మార్చి 30 72/30 73 కి 30 53,30.55 జూలై 29.95/29.95 అక్టోబరు 28.46/28 46 డిశంబరు 28.31/హై. మార్చి 28.21 బిడ్ 28 22 అస్కుడ్ మే 28.10 బిడ్ 28.12 అస్కుడ్

| | | |
|---|---|---|
| స్పిన్డింగ్ | హాజరు | 31 47 |
| మార్చి | (గరిష్ఠంధర | 30.78 |
| | (కనిష్ఠ ధర) | 30 6: |

### మార్చివాయిదా ధరలు

| | | | |
|---|---|---|---|
| సెటిల్ | ప్రారంభం | వెల | 30 67 |
| | నిన్న | | 30 65 |
| " | ముగింపు | వెల | 30 72 |
| | నిన్న | | 30 67 |



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, G. T. Madras.